# పాలించే ప్రభువులు ప్రేమించగలరా...?

"ఆహా!

వారూ ప్రేమిస్తారు. ప్రేమిస్తున్నా మనుకుంటూ కామిస్తారు. ఆ కామాంధత వారిని ఎంతటి అకృత్యాలకైనా పాల్పడ జేస్తుంది. అధికారం దుర్వినియోగమవుతుంది. పదవులు పాచికలవుతాయి...ఆ అధికార వైభోగం ముందు మోకరిల్లే వారి ఆశలూ, వ్యామోహాలూ వారి పతనాన్ని అదుపు చేయలేవు" అంటుంది ప్రఖ్యాత రచయిత్రి కమలాదాస్

ఈ విషయాన్నే నిర్భయంగా
చిత్రించింది తన 'కుక్కలు' నవలలో

'చతుర' జూలై సంచికలో సమర్పిస్తున్న సమగ్ర నవల 'కుక్కలు' తెలుగు పాఠకులకు ఒక క్రొత్త ప్రపంచాన్ని చూపిస్తుంది. ఆశ్చర్య చకితులను చేసి ఆలోచింప జేస్తుంది

నవలతో పాటు అదనంగా మినీ కతలు, అద్భుత చతుర ప్రపంచం...రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో 132 పేజీల నవనవలా వేదిక 'చతుర' వెల కేవలం 125 పైసలే

# చతుర










... లక్షల పాఠకులకు పైగా లాభం పొందిన కోర్సు.

నిస్సందేహంగా నిస్సంకోచంగా

ఆంగ్లంలో అనర్గళంగా మాట్లాడటం నేర్పే సులభమైన, సరళమైన పద్ధతి

# 'రేపిడెక్స్' ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్

## రేపిడెక్స్ పద్ధతి:—

నిత్య వ్యవహారంలో ఉపయోగించే ఆంగ్ల భాషను క్రమబద్ధమైన పద్ధతిలో చదువుతూ నేర్చుకునేందుకు, అర్థం చేసుకునేందుకు ఒక సహజమయిన, సులభమైన పద్ధతి... ఎలాగంటే చిన్నపిల్లలు బడికి వెళ్ళకముందే ఇంట్లోనివారి మాటలు విని సంభాషించటం నేర్చుకున్నట్లు అన్నమాట.

## దిగువ పేర్కొన్న యువతీ-యువకులు, స్త్రీ-పురుషుల కోసమై

* అండర్ గ్రాడుయేటయి కూడా ఇంగ్లీషు మాట్లాడటానికి సంకోచించేవారు.
* ఇంటర్వ్యూలలో అనుత్తీర్ణులయినవారు, మంచి ఉద్యోగాలు రానివారు.
* కళాశాలలో, సంఘంలో, క్లబ్బులో ఆధునిక యువతీ యువకులతో కలసి మెలసి తిరుగలేక పోతున్నవారు.
* బాగా చదువుకున్న పక్కింటి గృహిణులతో, చుట్టాలతో లేదా ఇతర నాగరిక కుటుంబ సభ్యులతో కలసి మెలసి తిరుగలేనివారు, ఇంగ్లీషు కాన్వెంటులలో చదివించలేని తల్లిదండ్రులు తమ పిల్లలకు ఇంటివద్ద చదివించి యోగ్యులుగా చేసేందుకు ఇది అత్యంత సహాయకరమైనది.
* వ్యాపారి లేదా కొట్టు యజమాని ఏ అధికారితోను స్పష్టంగా మాట్లాడలేకపోతే, చదువున్న వ్యక్తికి ఉద్యోగమిచ్చి సరిగా పని చేయించుకోలేకపోయినచో ఇది నిస్సందేహంగా సహాయపడుతుంది.

—అంతే కాదు జీవితంలో ప్రతి మెట్టుకు పునాది "రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్" విజయానికి గ్యారంటీ!

**డబ్బు వాపసు గ్యారంటీ**

మీకు 'రేపిడెక్స్ కోర్సు' సంతృప్తిని కలిగించక పోతే పుస్తకాన్ని తిరిగి పంపండి. తపాలా ఖర్చులు మినహాయించుకొని, మిగిలిన పైకమంతా మీకు పంపిస్తాము.

'రేపిడెక్స్ కోర్స్' అన్ని పుస్తకాల దుకాణాలలోను, బస్సు స్టాండులలోను, రైల్వే స్టేషను మరియు విమానాశ్రయాల్లోని బుక్ స్టాల్సులోను దొరుకుతుంది.




పెద్ద సైజులో
**408** పుటలు
వెల : రు. **18-00**
తపాలా ఖర్చులు:
రు. **5-00**

## రేపిడెక్స్ కోర్స్‌లోని ప్రత్యేకతలు:—

* సరియైన ఉచ్చారణ కోసమై పాఠాలన్నీ ఇంగ్లీషు లోను, మరియు తెలుగు లిపిలో కూడా ఉన్నాయి.
* ఏ భాషనైనా నేర్చుకునేందుకు ఇంతవరకు జాతీయ, అంతర్జాతీయ పరిశోధనల ఆధారంగా తయారు చేయ బడిన మొట్టమొదటి కోర్స్.
* సుమారు 2500 కి పైగా నిత్యం ఉపయోగించే ఇంగ్లీషు పదాలు, మీ ఝంఝాటనను పూర్తిగా పారద్రోలుతాయి.
* సుమారు 4500 కు పైగా చిన్న చిన్న సంభాషణా వాక్యాలు—అంటే,
* ఇంట్లో లేదా కార్యాలయంలో, కళాశాలలో, లేదా క్లబ్బులో, విందులో లేదా సంఘంలో...
* ప్రేయసి-ప్రియులు, ఆలు-మగలు, అధికారి- గుమస్తా, వ్యాపారి-కొనుగోలుదారు, పెద్ద-చిన్నలతో...
* ప్రియ సంభాషణలు, అభివందనము, అభినందనము, ప్రోత్సహించుట, ఓదార్చటంలో...
* మానసికానందం, ఆరోగ్యం, అన్న-పానీయాలు, వేష-భూషణాలు, సామాజిక-రాజకీయ ప్రసంగాలు...
* టెలిఫోనులో, ఎదుటి మనిషితో, సభలో లేదా ప్రత్యేక సందర్భంలో...

— అంటే ఏ విషయం గురించయినా...ఏ అంతస్థు స్త్రీ-పురుషులతోనయినా...సరైన పద్ధతిలో నిస్సంకోచంగా, ఇంగ్లీషులో మాట్లాడేందుకు అవసరమైన సంభాషణలు.

"రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్" విజయానికి గ్యారంటీ!

ప్రకాశకులు :



పుస్తక మహల్, ఖారీ బావులీ, ఢిల్లీ-6.

PUSTAK MAHAL KHARI BAOLI, DELHI-110006

'RAPIDEX' COURSE AVAILABLE AT : BANGALORE :— Bangalore Book Bureau, Subedar Chet Ram Road. Subash Stores, Avenue Road, HYDERABAD :— Book Selection Centre, Rajkamal Book Centre VIJAYAWADA :— Navodaya Publishers, Eluru Road Sree Venkateshwara Book Depot, Eluru Road, New Students Book Centre, Eluru Road. VISAKHAPATNAM :— Gupta Bros Books, Main Road, Book Centre, Main Road NELLORE :— Sri Srirama Students Emporium, Trunk Road. ALSO AVAILABLE at all leading book shops, Roadways Book Stalls, A. H. Wheeler's & Higginbothams Railway Bookstalls throughout South India.

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]
శుక్రవారం : 13-7-'79
సిద్ధార్థినామ సం. ఆషాఢ బ. చవితి
సంపుటము 72 : సంచిక 44
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





# రాగరేఖలు

సీరియల్

మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్



## 16

నాకు మతి పోయింది. తెలియని చికాకు కలిగింది. దారినపోయే తద్దినాన్ని నా నెత్తిన రుద్దుకున్నానే అనిపించింది.

ఇప్పుడు ఏం చెయ్యాలి? నా మెడకు చుట్టుకుందే ఈ పిల్ల? అసలు ఈ పిల్ల ఎవరో ఏమిటో — ఆ పోర్టరుకి ఎక్కడ దొరికిందో? రైలు ఇంకా సేపు ఆగినా సంగతి కనుక్కునేవాణ్ణే! కానీ ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? ఈ పిల్లనిఏంచెయ్యాలి?

నాకేంపట్టింది? వదిలేసి పోతేసరి! పెట్టెలో ఇంకా ఎంతమంది లేరు? వాళ్ళల్లో ఎవరూ ఈ సంగతే పట్టించుకోవడంలేదు. నేను మాత్రం ఎందుకు పట్టించుకోవాలి? చూసీ చూడనట్టుంటే సరి! నేను దిగాల్సిన స్టేషన్లో దిగిపోతాను. తరవాత ఏమైతే నాకెందుకు? నా సుఖం — నా సంతోషం నేనెందుకు పాడుచేసుకోవాలి? నా హాలిడే మూడ్ నేనెందుకు చెడగొట్టుకోవాలి? ఈ విధంగా సరిసరి విధాల పోయింది నా మనసు. ఈ ఆలోచనలతో నా చికాకు తగ్గలేదు. ఇంకా ఎక్కువయింది. మనసులో ఏదో అశాంతి—కోపం.

ఆ పిల్లమీద, ఆ పోర్టరుమీద, విపరీతమైన ద్వేషం కలిగింది. ఏం చెయ్యాలేని నిస్సహాయతతో నా సీట్లో కూలబడ్డాను.

అప్రయత్నంగా ఆ పిల్లవంక చూశాను. ఆ పిల్ల దీనంగా సీటు ఆనుకొని పడకుండా ఒక చేత్తో ఆ సీటునే పట్టుకుని నుంచుని వుంది— బిత్తర చూపులు చూస్తూ! ఏడుస్తూనే వుంది!

రెండు మూడేళ్ళు వుంటాయేమో? బొద్దుగా వుంది. చక్రాల్లాంటి విశాలమైన కళ్ళు, వాటినిండా నీళ్ళు బుగ్గలపై జారుతున్నాయి. చాలసేపట్నించీ ఏడుస్తున్నందువల్ల కాబోలు వెక్కిళ్ళు వస్తున్నాయి.

*(గత సంచిక తరువాయి)*

బూరె బుగ్గలు ముద్దు వస్తున్నాయి! తల రేగివుంది. బాబ్డ్ హెయిర్. రేగినా అందంగానే వుంది! తెల్లగా వుంది బంతి రంగు. గౌనుకూడా ఖరీదయినదే. కొద్దిగా మాసి నలిగిపోయి వుంది. గౌనుతో మాటి మాటికీ కళ్ళనీళ్ళు తుడుచుకుంటోంది. తనని ఎవరూ పట్టించుకునే వాళ్ళు లేకపోవడంతో నెమ్మదిగ తనలో తనే గొణుక్కున్నట్టుగా ఏడుస్తోంది!

ఆ పిల్లని ఆ విధంగా చూసేసరికి నా కోపం మెల్లిగా కరిగిపోయి జాలి కలగ



**జరిగినకథ 7 :** శిల్పకి బెంగుళూరు లోని కెనరా బాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్ళుతుంటే రైలుకోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడుతుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకటావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితుడైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్డాడు కృష్ణ. అరుణ్‌తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిందన్న శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్‌కి గాని, అరుణ్‌ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి కాని యిష్టముండదు. అరుణ్, శిల్ప ఒకరినొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని అమె తండ్రి వెంకటావ్‌తో కృష్ణ చెప్పగా, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వవృత్తాంతం గురించి అరుణ్‌తో చెపుతూ వుంటాడు కృష్ణ.

సాగింది. అట్లాగే చూస్తూ కూచున్నాను. ఆ తల్లిదండ్రులెవరో- అంత మాత్రం చూసుకోక్కర్లా? పిల్ల ఎక్కిందో దిగిందో నని! వెంటవుందో లేదోనని! ఆలోచనల్ని పక్కకి నెట్టి- "ఏడవకు- రా- వచ్చి- కూర్చో..." అన్నాను హిందీలో.

నేను పలకరించే సరికే ఆ అమ్మాయి పెద్దగా ఏడిచింది "మా..మా.." అంటూ! (అమ్మకోసం!) నేను చెయ్యి పట్టుకుని దగ్గరికి తీసుకుని నా దగ్గిర కూచోబెట్టుకున్నాను.

"అమ్మ దగ్గరికి వెళ్దాం, మరి ఏడవకు—"

కన్నీళ్ళు తుడుస్తూ ఓదార్చాను.

శబ్దం రాకపోయినా ఆ పిల్ల ఏడుపు మాత్రం మానలేదు. కన్నీళ్ళు కారుతూనే వున్నాయి. వెక్కిళ్ళు వస్తూనే వున్నాయి.

మీద చెయ్యివేసి, ఇంకో చేత్తో తలని నిమురుతూ—

"నీ పేరేమిటి?—" అని అడిగాను

"మున్ని-" అని చెప్పింది.

ఆ అమ్మాయిమీద-జాలి, ఆప్యాయతా కూడా కలిగాయి. కనీస మానవుడిగా ఆలోచించలేనందుకు నామీద నాకేఅసహ్యం కలిగింది. చిన్న పిల్లనిచూసి నేనంత విసుగు చెందాల్సిన పనేంవుంది? పక్క స్టేషన్లలో దిగి అప్పు పెట్టెల్లో విచారిస్తే సరి. ఎవరిపిల్లో అడిగితే సరిపోతుంది! ఆ పోర్టరు నన్ను చూపి, నా దగ్గిర వదిలి వెళ్ళాడు కాబట్టే ఆ బాధ్యత నాదేకదా?

ఆ పిల్ల తల్లిదండ్రులెవరో ఈ రైల్లోనే వుండివుండాలి. లేకపోతే పోలీసు స్టేషన్లో అప్పగిస్తే- ఆపిల్ల తల్లిదండ్రుల దగ్గిర — వాళ్ళే అప్పగిస్తారు.

ఈ పసిపాపమీద నాకీ కోపమెందుకు? రేపు నాకూ పెళ్ళికాబోతోంది.

ఆ తరువాత నాకూ పిల్లలు కలుగుతారు. ఎప్పుడైనా వాళ్ళకే ఈ స్థితి వస్తే? నేను ఆలోచించినట్లే, నేను ప్రవర్తించి నట్టే అందరూ ప్రవర్తిస్తే వాళ్ళ గతే మవుతుంది?

ఇట్లా నేను ఆత్మ విమర్శ చేసుకునేసరికి నాకు తృప్తి కలిగింది. మనశ్శాంతి కలిగింది. నాకు చేతనయింది నేను చేస్తాను. ఈ పిల్లని వాళ్ళవాళ్ళకి అప్పగించే బాధ్యత నాది. అంతవరకూ ఈ పిల్ల పూచీ కూడా నాదే అనుకున్నాను. ఈ విధంగా నేను నిర్ణయించుకున్నాక నాకు అంతులేని సంతోషం కలిగింది.

ఆ పాపతో కబుర్లు చెబుతూ కూచున్నాను. వచ్చీ రాని మాటలతో ఆ పాప నే నడిగిన వాటికి జవాబులు చెబుతోంది. నాన్న పేరు 'బాబా' అంది. అమ్మ పేరు 'మమ్మా' అంది. ఊరు పేరు ఏదో చెప్పింది నాకు అర్థం కాలేదు. మామూలుగా పసిపాపలకి వేరే ఏదో భాష వుంటుంది. నీళ్ళకి 'లాల' అనీ, అన్నానికి 'బువ్వ' అనీ, బయటికి వెళ్ళడానికి 'అప్పి పోదాం' అనీ ఇట్లాంటివి. అదే విధంగా అన్ని భాషల్లోనూ వుంటుంది. వాళ్ళ భాషలో మా వుండే వుంటుంది. ఆ భాషలో ఆ పాప ఏదో చెబుతుంటే నాకేమీ అర్థం కావటం లేదు.

ఇంతలో రైలు ఖరగ్‌పూర్ స్టేషన్లో ఆగింది. ఆ అమ్మాయిని ఎత్తుకుని గబగబా కిందికి దిగాను. పక్క కంపార్టుమెంటులోకి వెళ్ళాను. కొంతమందిని అడిగాను. 'ఈ అమ్మాయి మీ అమ్మాయా' అని! వాళ్ళు కాదన్నారు. ఆ పాపనే అడిగాను పెట్టెల్లో అమ్మ వుందేమో చూడమని. కళ్ళు పెద్దవి చేసుకుని చూసి లేదని తల తిప్పిందా పాప! మళ్ళీ తొందరగా దిగి, ఇంకో కంపార్టుమెంటులోకి ఎక్కాను. మళ్ళీ వాళ్ళని అడిగాను. ఆ పాపనీ అడిగాను. అదీ ఫలించ లేదు. కిందికిదిగి ఇంకో పెట్టెలో ఎక్కుదా మనుకుంటూ వుండగానే రైలు కూతవేసింది. నా కంపార్టుమెంట్లోకి ఎక్కేశాను. అట్లాగే ప్రతి స్టేషన్లోనూ చేస్తూ వచ్చాను. రైలు స్టేషన్లో ఆగగానే చేతులందించేది ఆ పాప! ఆశగా పెట్టెల్లోకి తొంగిచూస్తూ వుండేది. కానీ మొత్తంమీద ఆ రైల్లో ఆ పాప తల్లిదండ్రులు లేరని తెలిసిపోయింది నాకు! అన్ని పెట్టెల్లోనూ చూడడం అయిపోయింది. ఇంక ఈ అర్ధరాత్రి ఏం చేసీ ప్రయోజనం లేదని, తెల్లవారాక 'రైల్వే పోలీస్'కి రిపోర్టు చెయ్యవచ్చని అనుకున్నాను.

ఆ పాపకి రొట్టె, పాలు కొనియిచ్చి, అవి తిన్నాక కబుర్లు చెబుతూ నిద్రపుచ్చాను. అలసిన ఆ పాప తొందరగానే నిద్రపోయింది. నేను ఏదో ఆలోచిస్తూ, ఆ పాప జుట్టు నిమురుతూ కూర్చుండి పోయాను రాత్రల్లా.

* * *

తెల్లవారింది.

ఆ పాప నిద్రలేవంగానే మళ్ళీ అమ్మ కోసం ఏడుపు మొదలు పెట్టింది.

నాకు నిద్ర లేకపోవడంవల్ల, అలసటగా వుండి—కళ్ళు మండుతున్నాయి.

నేను దిగాల్సిన స్టేషన్ వస్తుందని నా సామాను సర్దుకుని రెడీగా పెట్టుకున్నాను.

పూరీ స్టేషన్లో దిగి, ఈ పాపని పోలీస్ స్టేషన్లో అప్పగించి నేను ఊళ్ళోకి వెళ్దామనుకున్నాను.

పాపని నా ఒళ్ళో కూచోబెట్టుకున్నాను.

"అట్లా ఏడవకూడదమ్మా, అమ్మ దగ్గరికి వెళ్దాంగా - మనిద్దరం ఫ్రెండ్సుమి కదూ—నా మాట వింటావు కదూ?" అంటూ ఓదార్చాను పాపని.

మొహం కడిగి-కాఫీ నేను తాగుతూ—పాలు ఆ పాపకి ఇప్పించాను. కిటికీలోంచి బయటకి చూస్తూ కూచుంది. ఆ తరువాత రైలు పూరీ స్టేషన్లో ఆగింది.

పాపతో సహా నేను కిందికి దిగాను సామాన్లతో! ముందా పాపని పోలీస్ స్టేషన్లో అప్పగిద్దామని తీసుకెళ్ళాను. పోలీసువాళ్ళని చూడగానే— ఆ పాప నన్ను గట్టిగా పట్టుకుని — పెద్ద పెట్టున ఏడవడం ప్రారంభించింది! ఎన్నివిధాల అనునయించినా వినలేదు. ఒకళ్ళ



మాటలు ఇంకోళ్లకి వినబడనంత గట్టిగా ఏడుస్తోంది. "నేను నీతోనే వస్తా — నేను ఇక్కడ వుండను" అంతకంతకీ ఎక్కువయింది ఏడుపు! మొహంలో భయం స్పష్టంగా కనబడుతోంది.

"సరేనమ్మా—సరే! ఇక్కడ వుండను. వుంచనుగా! నాతోనే తీసికెళ్తా — నువ్వు ఏడవకు" అని చెప్పాక కాస్త తగ్గింది ఏడుపు.

పోలీస్ రిపోర్ట్ ఇచ్చాను.

"ఈ పాప నా దగ్గిరే వుంటుంది. ఎవరన్నా వెతుక్కుంటూ వస్తే వుండమనండి. నేనిక్కడ ఉన్నన్ని రోజులూ రోజూవచ్చి రెండుపూటలా మీ స్టేషన్లో కనబడతాను. నా అసలు ఉద్దేశం ఇది — పాపని ఇక్కడే వుంచేవాడ్నిగాని... చూశారుగా భయపడుతోంది" అని చెప్పాను వాళ్లతో. నా హైదరాబాద్ అడ్రసు ఇచ్చాను. పాపను ఎత్తుకుని ఊళ్లోకి వచ్చాను. ఒక హోటల్లో రూము తీసుకున్నాను. నేను స్నానం చేశాను. పాపకి కూడా స్నానం చేయిద్దాం అంటే గుడ్డలు లేవు. పాపనితీసుకుని బజారెళ్లాను. మంచి ఫాషన్‌గా వున్న గౌనులు రెండు కొన్నాను. రెండు నిక్కర్లు కొన్నాను. ఒక టూత్‌బ్రష్,నాలికబద్ద కొన్నాను.బిస్కెట్లు, చాక్లెట్లు, స్వీట్లు, పళ్లు ఇంకా కావలసినవన్నీ తీసుకున్నాను. కొన్ని బొమ్మలు కూడా కొన్నాను పాపకోసం.

రూముకి తిరిగి వచ్చాం. పాప చాలా సంతోషంగా వుంది. నన్ను ముద్దు పెట్టుకుంది. ఎగిరి గంతులు వేసింది. పాటలు పాడింది. "నువ్వు చాలా మంచి వాడివి. నిన్నేమని పిలవాలి?" అడిగింది. "బాబా అని పిలవనా? మా నాన్న కనిపించే వరకు నిన్ను బాబా అంటాను" అందిమళ్లీ తనే వచ్చీరాని మాటలతో. కిందటి రోజు నించి వింటూ వుండటం వలన పాప భాష కాస్త కాస్త అర్థం అవుతోంది నాకు. అప్పటికీ అలవాటుపడుతున్నాను నేను.

నీళ్లు నేనే పోసి బట్టలు వేశాను. బాబ్డ్ హెయిర్ గనక తల దువ్వడంలో ప్రాబ్లమ్ లేకపోయింది.

ఇవన్నీ చేస్తుంటే నాకే విచిత్రంగా వుంది. నే నెవరు? ఈ పాప ఎవరు? నే నివన్నీ చెయ్యడ మేమిటి? అనిపిస్తోంది.

# రాగరేఖలు

కొన్ని గంటలలోనే ఆ పాప నాకు దగ్గిరైపోయింది.

పాపకూడా రెడీ అయ్యాక టిఫిను తీసుకున్నాం. స్నానంచేసి, మంచి గౌను వేసుకుని, తలదువ్వుకున్న పాప బంగారు బొమ్మలాగా మెరిసిపోతోంది. చాలా అందంగా వుంది. దగ్గిరికి తీసుకుని ముద్దు పెట్టుకున్నాను.

బొమ్మలతో ఆడుకుంటోంది పాప. నేను - రోజా పేపర్ తెరిచాను- చదువుదామని. అందులో- మొదటి పేజీలోనే "పెద్ద రైల్వే యాక్సిడెంట్!" అనివుంది. కుతూహలంగా చదివాను.

## ఉపశమనం

కలల కన్నీంపుల నీడల్లో
కరిగి తిరిగే నేను
వాన్తవపు అట్టడుగు లోయల్లో
వాలి కూలిపోతున్నాను.

ఆశల నీలిరంగు తెరటాల్లో
దిశ దిశలా తిరిగే నేను
నైరాశ్యపు రక్కసి కోరల్లో
నలిగి పిప్పి నవుతున్నాను.

తీయని ఊహల పరిష్వంగంలో
తేలియాడుతున్న నేను
తెరచాప చినిగిన నావలో
తీరానికి ప్రయాణం కడుతున్నాను.

కల్లోల కడలి మధులు
కబళించగా వరదగా నన్ను
కాగితము, కలము తీసి
కవిత వ్రాసి పొందాను
కొంతలో కొంత ఉపశమనాన్ని.

— దొడ్లంకి వెంకట్రావ్.

కలకత్తానించి-అదే హౌరానించి ఢిల్లీ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ట్రైన్‌కి యాక్సిడెంట్ అయింది.

గూడ్సు బండికి ఢీ కొందట. ప్రయాణికులు చాలా మంది మరణించారుట. నా మనస్సు ద్రవించింది.

అంటే, ఆ ట్రైను, ఆరోజు నేను చూసినది—కాదుకదా? అదేనేమో! కొంపదీసి దాంట్లో పాప తల్లిదండ్రులు లేరు కదా? ఉంటే...ఉంటే నేనేం చెయ్యాలి? అక్కడికి పాపని తీసుకెళ్లాలా?

భయపడదూ? అట్లాంటి భీభత్స దృశ్యాలు పాపకి చూపించకూడదు వద్దు!

మరయితే ఆ పాప తల్లిదండ్రులు దాంట్లో వున్నా, నేనెట్లా గుర్తుపట్టగలను?

ఛీ-ఛీ-ఏమిటి నా ఆలోచనలు? పాప తల్లిదండ్రులు దాంట్లోనేమీ వుండివుండరు. అసలువీళ్లు ఎక్కడివాళ్లో కూడా నాకు తెలిసే? ఏ రైల్లో వెళ్లి వుంటారో, ఎక్కడికి వెళ్లి వుంటారో, అసలు ఎవరో?

కలకత్తాలో దిగిన వాళ్లో?

లేక-కలకత్తానించి వెళ్లినవాళ్లో!

చాలామంది వివిధ ప్రాంతాల నించి వస్తారు, పూజా ఉత్సవాలు చూడడానికి. వాళ్లల్లో వీళ్లూ ఒకళ్లేమో! నేను పేపర్లో వేయిస్తాను. పాపఫొటో, వివరాలు ఇస్తూ పేపర్లో ప్రకటన వేయిస్తాను. పాప తల్లిదండ్రులు ఎక్కడున్నా వచ్చి తీసికెళ్తారు. అన్నిపేపర్లల్లో,అన్ని ఎడిషన్లల్లో వేయిస్తాను.

తల్లిదండ్రులు కాకపోతే వాళ్లకి సంబంధించిన వాళ్లెవరైనా కూడా రావచ్చు.

ఈ విధంగా అనుకున్నాక గానీ నా మనసుకి తృప్తిగా అనిపించలేదు.

అప్పటికప్పుడే పాపని ఫొటోస్టూడియోకి తీసికెళ్లి ఫొటో తీయించాను. ఆ తరువాతి రోజే ఇస్తానన్నారు వాళ్లు ఫొటోని! తరువాత పాపనితీసుకుని ఊరంతా తిరిగాను, గుడికి వెళ్లాం.

"ఓ జగన్నాథస్వామి! ఈ పాపని వాళ్ల తల్లిదండ్రుల దగ్గిరకి చేర్చు" అని వేడుకున్నాను.

బీచ్‌కెళ్లాం.

సముద్రాన్ని చూసి మైమరచి పోయింది పాప. ఇసుకలో పరుగులు పెడుతూ ఆడుకుంటోంది. నేను తన్మయుణ్నాయి చూస్తూ కూచున్నాను. పిచ్చుక గూళ్లు కట్టి ఇచ్చాను పాపకి. ఎంతో ఉత్సాహంతో పాటలు పాడుకుంటూ, కేరింతలు కొడుతున్న పాపను చూస్తున్నకొద్దీ నాలో ఆ పాపంటే ఆపేక్ష పెరగసాగింది.

సాయంత్రం మళ్లీ పోలీస్ స్టేషన్‌కి వెళ్లాను పాపతో. వివరాలు రాలేదని చెప్పారు వాళ్లు. పోలీస్ స్టేషన్ వైపు వెళ్తుంటేనే

ఉత్సాహం, సంతోషం పోయి ఏడుపు ముఖం పెట్టింది పాప. కళ్లల్లో నీళ్లు!

చెప్పలేని జాలి కలిగింది నాకు. కానీ ఇది నా డ్యూటీ కదా? పోలీస్ స్టేషన్ నించి ఇంతలికి వచ్చేదాకా బిక్కముఖంతోనే వుంది పాప! ఆ రాత్రి నా దగ్గరే పడుకుంది పాప. అన్నం తినేటప్పుడు, నిద్రపోయేటప్పుడూ మాత్రం వాళ్లమ్మని గుర్తు చేసుకుంది పాప. కానీ అంతగా ఏడవలేదు. నిద్రపోయే దాకా ఏవో కబుర్లు, కథలూ చెప్పాను. నాకూ కిందటిరోజు నిద్ర లేకపోవడం వల్ల తొందరగానే నిద్ర వచ్చేసింది.

## 17

ఆ తరువాత రోజే. పేపర్లకి ప్రకటన ఇచ్చాను ఫొటోతో సహా. ఒక వారంరోజులు అక్కడే వుండిపోయాను, ఎవరన్నా వస్తారేమో పాపకోసం అని! ముందు హోటల్ అడ్రసు ఇచ్చాను. ఎవరన్నా వస్తే వాళ్లకి పాపని అప్పగించి నేను హైదరాబాద్ వెళ్ళి పోదామని నిశ్చయించుకున్నాను. ప్రకటన పడ్డ మర్నాడు పాపకి చెప్పాను మీ అమ్మా నాన్నా వస్తారని. పాపని చక్కగా రెడీచేసి కూచోబెట్టాను. ఆరోజు ఎక్కడికీ వెళ్ళకుండా రూములోనే కూచున్నాను. పాప వెళ్ళిపోతుందని తల్చుకుంటేనే బాధగావుంది నాకు. నాకు బాగా అలవాటయి పోయింది పాప. పాపయితే అప్పుడే వాళ్ళమ్మా-నాన్నా వచ్చేసినట్లు మాట్లాడుకుంటోంది తనలో తనే. ఏమిటో స్పష్టంగా అర్థం గాక పోయినా మొత్తంమీద పాప భాషని నేర్చుకున్నాను నేను కూడా! పాప మాట్లాడేది పూర్తిగా హిందీకాదు. ఇంకేదో భాష కలిసింది. అదేదో నాకు తెలియడం లేదు. పాప స్పష్టంగా మాట్లాడితే తెలుస్తుందేమో? కానీ అంత చిన్నపిల్ల స్పష్టంగా మాట్లాడాలని నేను అనుకోవడమేమిటి? నవ్వుకున్నాను. కానీ పాప మాట్లాడే తీరు, ఆ ముద్దు మాటలు, ఆ గొంతూ నన్ను ముగ్ధుణ్ణి చేస్తున్నాయి. నిజంగా అవి పసిడి పలుకులే! అభమూ శుభమూ తెలియని పసి పాపలు భగవంతునితో సమానం అంటారు. నేను దగ్గరికి తీశాను కాబట్టి దగ్గరికి వచ్చింది. నేను వదలలేకపోతున్నాను. నిర్మలమైన నిష్కల్మషమైన కళ్ళూ, చల్లని చిరునవ్వూ. అమాయకమైన ఈ పాపని నేను విడిచి వుండగలనా? కానీ- కానీ- వాళ్ళవాళ్ళు వస్తే వాళ్ళకి పాపనివ్వడం నా ధర్మం.

సాయంత్రం అయింది-రాత్రి అయింది. పడుకునే టైము అయింది. ఎవరూ రాలేదు పాపకోసం. పడుకోబోతూ అడిగింది పాప. 'అమ్మ ఏదీ' అని!

'రేపొస్తుంది' అని చెప్పాను. నిద్ర పోయింది ఆలోచిస్తూ!

* * *

ఆ తరువాత రోజూ అట్లాగే గడిచింది. ఎవరూ రాలేదు పాపకోసం. ప్రకటన పడ్డాక వారం రోజులు గడిచాయి.

మళ్ళీ నా మనస్సు బరువెక్కసాగింది. ఎన్నాళ్ళని ఇక్కడ వుండను? పాపని వది లేసి ఎట్లా వెళ్ళను? ఎక్కడ వదలను పాపని? పోనీ, నాతో తీసికెళ్తే...? హఠాత్తుగా, ఇల్లు, చిత్ర గుర్తుకొచ్చారు. ఇంక ఇక్కడ వుండలేననిపించింది.

ఇక్కడ ఈ ఆలోచనలతో బుర్ర పాడు చేసుకోవటం కంటే, హైదరాబాద్ వెళ్తే, అక్కడ నాకు సలహా చెప్పేవాళ్ళు రామయ్య, రావుగారు, చిత్ర వున్నారు.

అందరం కలిసి ఆలోచించి ఏదన్నా చెయ్యొచ్చు అనుకున్నాను.

పోలీస్ స్టేషన్‌లో చెప్పాను. 'నేను హైదరాబాద్ వెళ్తున్నాను. పాప నా దగ్గరే వుంటుంది. ఎవరన్నా పాపకోసం వస్తే నా హైదరాబాద్ అడ్రసుకి పంపించమని' చెప్పాను.

వాళ్ళు సరేనన్నారు.

పాపతో హైదరాబాద్ బయలుదేరాను. నాతోపాటే రైలు దిగిన పాపని చూసి రామయ్య ఆశ్చర్యపోయాడు.

"ఎవరు బాబూ ఈ పాప?" అడిగాడు రామయ్య.

"చెప్తాను రామయ్యా. ఇంటికెళ్ళాక అన్నీ చెప్తాను" అన్నాను.

మేము తెలుగులో మాట్లాడుకోవడం ఆశ్చర్యంగా చూస్తోంది పాప. ఇంటికెళ్ళాక పాప పన్లన్నీ రామయ్యే చేశాడు.— పాప రామయ్యని 'రామ్ తాతా' అని పిలవడం మొదలు పెట్టింది. పాప భోం చేసి నిద్ర పోయాక పాప విషయమంతా చెప్పాను రామయ్యతో. రామయ్య ఏమీ మాట్లాడ లేదు.

"ఇక్కడి అడ్రసు కూడా ఇచ్చాను రామయ్యా. పాప తల్లిదండ్రులు ఇక్కడికి కూడా రావచ్చు. చూద్దాం. వస్తే వాళ్ళమ్మాయిని వాళ్ళకి అప్పగించేస్తాను. అంత దాకా పాప బాధ్యత నాదే..." అన్నాను.

"బాబూ నే నడుగుతున్నానని అనుకోకండి. కానీ ఎవరూ రాకపోతే ఏం చేస్తారు పాపని?"

"అప్పటి సంగతి ఆలోచిద్దాంలే రామయ్యా" అన్నాను.

చిత్ర ఇంకా రాలేదని తెలిసింది. రోజులు గడుస్తున్నాయి.

(ఇంకా వుంది)



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**శాసన సభ్యుల పర్యటన :**

తెలంగాణా అభివృద్ధి బోర్డు నాయకత్వంలో పదకొండుమంది శాసనసభ్యులు ఉత్తరాపథంలోని కొన్ని రాష్ట్రాలలో పర్యటించి జూన్ మొదటివారంలో తిరిగి వచ్చారు. అక్కడి వ్యవసాయ విధానాలను, పరిశ్రమలను గురించి వారు తెలుసుకొని వచ్చారు. బృందంలో శ్రీయుతులు ఎస్. లక్ష్మారెడ్డి, తిరుమలయ్య, నర్సయ్య నరసింహారెడ్డి, గోవర్ధన్‌రెడ్డి, ప్రతాపలింగం, పోచయ్య, వెంకటరెడ్డి, అక్బరలీ పాషిరి ఉన్నారు. తెలంగాణా అభివృద్ధి బోర్డు అధ్యక్షుడు శ్రీ అనంతరెడ్డి ఈ బృందం నాయకులు.

**వస్త్రాలపై చిత్రాల నేత :**

వస్త్రాలపై చిత్రాల నేత తెలుగు దేశంలో అనాదిగా ఉంది. కలంకారీ పని తనంతో పాటు చిత్రాల నేత కూడా కాళహస్తి, బందరు, కనిగిరి మున్నగు ప్రాంతాలలో ఉన్నది. తెలంగాణా ప్రాంతంలో వరంగల్ జిల్లాలోను అనువంశికంగా ఉన్నది. ఈ సంగతి అఖిల భారత చేతి వృత్తుల బోర్డుకు ఈ మధ్యనే తెలిసింది. దీనికి ప్రోత్సాహమివ్వడానికి బోర్డు నిర్ణయించింది. ఈ చిత్రాల నేతలో రామాయణ భారతాది పురాణేతిహాసాల కథా ఘట్టాలను నేస్తారు. ప్రస్తుతం వరంగల్ జిల్లాలో చేర్యాల గ్రామంలో చంద్రయ్య అనే కళాకారుడు ఈ కళను అనువంశికంగా సంపాదించాడు. ఈయన తండ్రి ఈ కళలో నిపుణుడు. చంద్రయ్య 20 మీటర్ల గుడ్డపై ఈ కథా ఘట్టాలను నేస్తాడు. చంద్రయ్య దేశంలోని వివిధ ప్రాంతాలలో జరిగిన ప్రదర్శనలలో పాల్గొని తన గొప్ప కళానైపుణికి ఖ్యాతి సంపాదించాడు. కళా ప్రియులు పలువురు ఈ కళతో ఆకృష్టులయ్యారు. ఒక్కొక్క కథా చిత్రం నేతకు దాదాపు రెండు నెలలు పడుతుంది. ఒక అమెరికా కథా ప్రియుడు ఇలాటి పది చిత్రపటాలకు ఆర్డరిచ్చాడు. ఇప్పుడు చంద్రయ్యకు తీరిక లేదు. రెండు మూడేళ్లకు సరిపడా పని ఉంది. ఈ చిత్రాల నేతలో ఇతరులకు శిక్షణ ఇవ్వడానికి కూడా అఖిల భారత చేతి వృత్తుల బోర్డు ఏర్పాటు చేస్తున్నది.

**ఏక కులంలో వివాహాల నిషేధానికి విజ్ఞప్తి :**

కుల నిర్మూలనకు కీలకం వివాహాలలో ఉంది. గనుక ఆయా కులాల వారు తమ కులాలలోనే వివాహం చేసుకోడాన్ని నిషేధిస్తూ, విధిగా వర్ణాంతర వివాహమే చేసుకోవాలని విధిస్తూ హిందూ వివాహ చట్టాన్ని సవరించాలని, కుల నిర్మూలన సంఘం జూన్ 9వ తేదీన జరిపిన రాష్ట్రస్థాయి మహా సభ తీర్మానించింది. జాతి సమగ్ర వికాసానికి కుల వ్యవస్థ పెద్ద ఆటంకం గనుక, దాని నిర్మూలనకు వెనకబడిన వర్గాలకు ఆర్థిక రాజకీయ సాంఘిక విద్యా సౌకర్యాలు కల్పించడం మాత్రమే కాక, కులాంతర వివాహాలు, సహపంక్తి భోజనాలు ముఖ్యమని, కులాలు సూచించే శాస్త్రి, నాయుడు, రెడ్డి వంటివాటిని పేర్లనుంచి తొలగించాలని ఈ మహాసభ కోరింది. ఈ మహ సభ ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో జరిగింది. రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ చల్లా కొండయ్య మహా సభను ప్రారంభిస్తూ కులాలు ఆదిలో ఏర్పడినవి కావు. మధ్యలో కొందరు స్వార్థపరులు సృష్టించినవి. కులంకన్నా గుణం ప్రధానం అన్నారు. అధ్యక్షత వహించిన హైకోర్టు న్యాయమూర్తి శ్రీ టి. లక్ష్మయ్య, ప్రత్యేక సంచికను విడుదల చేసిన న్యాయమూర్తి శ్రీ కె. పున్నయ్య, శ్రీ వీరాస్వామి రచించిన కుల నిర్మూలనం ఎలా? అనే గ్రంథాన్ని ఆవిష్కరించిన పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యుడు శ్రీ టి. వి. నారాయణ కుల నిర్మూలనం అవసరాన్ని గురించి ప్రసంగించారు. కులాన్ని రాజ్యాంగ రీత్యా రద్దు చేసి, కుల వ్యత్యాసం పాటించే వారిని శిక్షించడానికి చట్టాలు చేయాలని, నగరంలో శ్రీ వీరేశలింగం హాలు నిర్మించి సంస్కరణ వివాహాల నిర్వహణను ప్రోత్సహించాలని ఈ మహాసభ సూచించింది. మహా సభకు 300 మంది ప్రతినిధులు హాజరయ్యారు. రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులు శ్రీ జె. వీరాస్వామి స్వాగతం చెప్పారు. ఎనిమిదేళ్ల క్రిందట ఏర్పడిన కుల నిర్మూలన సంఘం ఇప్పుడు ఉద్యమంగా తయారయిందని ఆయన అన్నారు.

**శ్రీ హయగ్రీవాచారి హితవు :**

జైన ఆధ్యాత్మయోగ ఉపాధ్యాయ శ్రీ పుష్కర మునిజీ 58 వ దీక్షా స్వరణ జయంతి జూన్ 5 వ తేదీన జరిగినప్పుడు దేశంలోని వివిధ మతాలవారు పరస్పరావగాహనతో కలసిమెలసి జీవించాలని రాష్ట్ర మంత్రులు శ్రీ తిరువరంగం హయగ్రీవాచారి, శ్రీ జాగారెడ్డి ఉద్బోధించారు. జైనమతస్థులు రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి చేస్తున్న సేవను మంత్రి శ్రీ జాగారెడ్డి ప్రశంసించారు. అధ్యక్షత వహించిన ఆచార్య సమ్రాట్ ఆనంద ఋషిజీమహారాజ శ్రీ పుష్కరమునిజీ సమాజానికి చేసిన సేవను ప్రశంసించారు. ఆది అందరికీ మార్గదర్శకులు గావుండాలని సూచించారు. జైన ప్రముఖుడు శ్రీ చంపాలాల్ కొటారీ ఈ సందర్భంలో జైన ఆధ్యాత్మిక యోగ విధానాలను గురించి రచించిన 1200 పుటల గ్రంథాన్ని ఆవిష్కరించారు. ప్రారంభంలో ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ గోపాలరావు ఎగ్‌బోటే స్వాగతం చెప్పారు.

**రాజ్ నారాయణ సంకల్పం :**

శ్రీ రాజనారాయన్ ఏ పార్టీలోనూ ఉండని వ్యక్తి. నాకు మంత్రి పదవి వద్దు మొర్రో! అని మొర పెట్టుకున్నాడు పాపం. అదెలా అవుతుంది! నీవు ఇందిరా గాంధిని ఓడించిన మహా వీరుడివి నీవు మంత్రి కాకపోతే ఎట్లా? అని మంత్రి పదవి కట్టబెట్టారు అతనికి. అవాకులు చెవాకులలో అగ్రేసరుడైన రాజనారాయన్ స్వర్గానికి వెళ్ళినా తన వాగుడుకత్వం మానడు. అలాటివాడి నిగ్రహానుగ్రహాలు కూడా అవ్యవస్థిత చిత్తస్య ప్రసాదోపి భయంకరః అనే లోకోక్తి దృష్టాంతంగా ఉంటాయి. అలాటివారికి తెలిసిందల్లా పిడుక్కూ, బియ్యానికీ, ఒకే మంత్రం, ఆ మంత్రమే జరిపించాడు రాజ. తాను తుఫాను దెబ్బ తిన్న ఆంధ్రప్రాంతంలో పర్యటనకు వచ్చా

...న్నారు. ఎన్నికల సభ ఎన్నికలలో ప్రచారానికి వచ్చి మీరు లోక్ సభకు జనతాను ఎన్నుకోలేదు. కనుక నే తుఫాను వచ్చింది అని ప్రసంగాలు చేశాడు. దానితో జనతాకు రావలసినవోట్లు రాకపోయాయని అప్పట్లో జనం అనుకున్నారు. ఈ పర్యటనలోను పూరు కుండడుగదా! జూన్ 10వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రసంగిస్తూ, ఆర్. ఎస్. ఎస్. ను గురించి, తక్కిన విషయాలను గురించి పాత పాటే పాడారు. వాజపేయిని, అద్వానీని మంత్రివర్గంనుంచి తొలగించాలని, ఆర్. ఎస్. ఎస్.ను నిషేధించాలని, ఆర్. ఎస్. ఎస్. తో సంబంధమున్న ముఖ్యమంత్రులందరూ రాజీనామా చేయాలని, ఈ విషయంలో వారికి వారే సాటి అని, ఆర్.ఎస్.ఎస్. ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకు ఉత్తరప్రదేశ్‌లో మూడు చోట్ల శిక్షణ శిబిరాలు నిర్వహిస్తున్నామని రాజనారాయణ్ అన్నారు. తన నోరు మూయించే మొనగాడు పుట్టలేదని అన్నాడు.

**అజ్ఞాత చరిత్ర పుట**

పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలో నిజాం నిరంకుశ పరిపాలనను ప్రతిఘటించిన అజ్ఞాతవీరులపై శ్రీ ఖండేరావు కుల్కర్ణి రచించిన "హైదరాబాద్ అజ్ఞాత చరిత్రపుటలు" అనే గ్రంథానికి సుప్రసిద్ధ విప్లవకవి శ్రీ నిఖిలేశ్వర్ చేసిన అనువాదాన్ని రాష్ట్ర సమాచార శాఖామంత్రి శ్రీ బి.రామ్‌దేవ్ మే 27న ఆవిష్కరిస్తూ, తెలంగాణా ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని, స్వాతంత్ర్య భావాలను ఉద్దీప్తం చేయడంలో ఆర్యసమాజ గణనీయమయిన పాత్ర నిర్వహించినదన్నారు. అజ్ఞాతవీరుల చరిత్రలు ఎన్నో వెలుగులోకి రావాలని ఆయన సూచించారు. ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ గోరాశాస్త్రి ప్రసంగిస్తూ, నిజాం క్రూర పరిపాలనను అంతం చేయడానికి జరిగిన అజ్ఞాతవీరుల పోరాటం దేశంలో జరిగిన స్వాతంత్ర్యోద్యమం అంతే గొప్పదని. వారి స్మారకార్థం నగరంలో ఒక ఆడిటోరియం నిర్మించాలని సూచించారు. ప్రముఖ స్వాతంత్ర్య వీరుడు విజయకుమార్ సిన్హా ప్రసంగిస్తూ, దేశం విదేశ పరిపాలన నుంచి విముక్తి పొందినా, హింసాత్మక సమస్యలనుంచి విముక్తి పొందలేదన్నారు. ఈ ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన అధికారభాషా కమీషన్ అధ్యక్షుడు శ్రీ వందేమాతరం రామచంద్రరావు నిజాం ప్రజల విముక్తికి ఆర్య సమాజ జరిపిన పోరాటంవివరించారు. గ్రంథరచయితలు శ్రీ కుల్కర్ణి గ్రంథాన్ని పరిచయం చేశారు.

**ఉపశ్రుతి :**

కుల నిర్మూలన సంఘం నాయకులు కులాంతర వివాహాలు చేసుకున్నవారేనా ? అనడిగారు ఒక పెద్ద మనిషి సభ్యుల. ఈ సందర్భంలో చలంగారి మాట జ్ఞాపకం వస్తున్నది. స్త్రీ స్వాతంత్ర్యం అంటే అందరికీ ఇష్టమే! కాని, ఆ స్త్రీ పరాయిది అయి ఉండాలి అన్నారు చలం. అలాటిదే ఇది కూడా అన్నారొక పత్రికా రచయిత కలుగజేసుకొని.



# కొత్త నక్షత్రం

## "శ్రీ విరించి"

సుజాత బద్ధకంగా ఆవలించింది. ఇంకా పక్కమీద నుంచి లేవలేదు. టైము అప్పుడే ఎనిమిది గంటలయింది ఇదివరకటి రోజులయితే ఈపాటికి బస్సుకోసం పరుగెత్తే టైము. అంటే ఉదయం ఏడున్నర, ఏడు ముప్పావుకల్లా తన ఉదయ కార్యకలాపాలన్నీ కానిచ్చుకుని ఆఫీసుకి వెళ్ళటానికి తయారయ్యేది.

తను యింకా నిద్ర లేవకముందే ఆయన స్నానం అదీ పూర్తిచేసి ముందు గదిలోకి వెళ్ళిపోతున్నారు. చెప్పకుంటే సిగ్గుచేటు, ఆయనే కాఫీ తయారుచేసి తను తాగి తన కోసం ఫ్లాస్కులో పోసి మూత వేస్తున్నారు. ముందు గదిలోకి వెళ్ళిపోవటానికి ముందు తననుకాస్త లేపినట్లుగా కుదిపి 'నేను ఆఫీసు గదిలోకి వెడుతున్నాను. నీ కాఫీ ఫ్లాస్కులో సిద్ధంగా వుంది. లేవగానే తాగేసెయ్యి' అని చెప్పేస్తున్నారు. అప్పుడు గాని తనకు మంచంమీద నుంచి లేవాలని అనిపించలేదు.

ఏటొచ్చీ యీ నెలరోజులనుంచే యింత విశ్రాంతిగా తీరుబాటుగా వుంటూంది. అంతకుముందు, అంటే పెళ్ళి కాకపూర్వం, సుజాతకు ఒక్క క్షణం తీరుబాటు లేదు. అమ్మతోబాటు ఉదయమే, యింకా సూర్యుడు రాకముందే లేచేది. తన స్వంత పనులన్నీ పూర్తిచేసుకుని అమ్మకు కాఫీ టిఫిన్లు తయారు చేయడంతో తోడ్పడేది. ఎనిమిది గంటల లోపలే తను కూడా అవురావురుమని రెండు ముద్దలు తినేసి, ఆరు అవున్సుల కాఫీ గొంతులో పోసుకుని, బస్సుకోసం పరుగు తీసేది. బస్సుమీద ఆధారపడిన వాళ్ళెవరూ తమ పనులు తీరుబాటుగా చేసుకుందుకు వీలు లేదు. ఆ బస్సులు యెప్పుడు వస్తాయో ఎప్పుడు పోతాయో ఎక్కడ నిలుస్తాయో అసలు నిలుస్తాయో లేదో యెవరూ యిదమిత్థంగా చెప్పలేరు. సాధ్యమయినంత ముందుగా వెళ్ళి 'బస్ స్టాప్' అనబడే చోట నిలబడి వుండాలి. కండక్టరు డ్రయివర్లకు దయ తప్పకుండా వుంటే బస్సు యేదో టయిముకు అక్కడకు వస్తుంది. దాంట్లో కూర్చుంటే యిరవయి నిమిషాలలో ఆఫీసు దగ్గర స్టాపుకు తీసుకు వెడుతుంది. అక్కడినుంచి అయిదు నిమిషాల నడక. అంతే తను ఆఫీసుకు చేరుకునే సరికి ఎనిమిదిన్నర అయిపోతుంది.

ఆఫీసు ఎనిమిదిన్నరకే అయినా సాధ్యమయినంత తొందరగా అంతకంటే ముందే వచ్చి కూర్చుంటాడు తన ఆఫీసరు, దయానిధి. ఇంకా నయం, అందరినీ అలా రమ్మని ప్రాణం తీసేవాడు కాదు. ఎనిమిది ముప్పావు తరువాత వచ్చేవాళ్ళ విషయంలో మటుకు కాస్త నిర్మొగమాటంగా వుండేవాడు. బస్సులు - వాటి రాకపోకల విషయంలో ప్రత్యక్ష జ్ఞానం వున్నవాడు గనుక ఒకటి రెండు నిమిషాలకు యేమీ అనేవాడు కాదు. అయినా కాస్తంత ఆలస్యంగా వచ్చి ఆయన

కంటె ఎడడానికి యిబ్బందిగా ఫీలయ్యే వాళ్ళు ఆఫీసు ఒంటా.

దయానిధి చాలా నిక్కచ్చి మనిషి. తనకో 'స్టాండర్డ్', యితరులకంకో 'స్టాండర్డ్' కాదు ఆయన ప్రవర్తన పని యితరులకు ఉదాహరణపూర్వకంగా వుంటాయి. అందుచేతనే ఆయన 'నోటీస్' కు వెళ్ళటానికి అందరికీ కాస్త బెరుకుగా వుంటుంది.

సుజాత పూర్వపు ఆఫీసు గురించి, అక్కడ తన ఉద్యోగం గురించీ నెమరు వేసుకొన సాగింది. దయానిధి పాపం చాల మంచివాడు. ఆయన దగ్గర పని చేయడం వల్ల జీవితంలో నేర్చుకోవలసినవి చాల తెలిసివచ్చాయి. తను పెళ్ళి చేసుకుని ఉద్యోగం మానేస్తోందంటే ఆయన బాధ పడ్డాడు.

'పెళ్ళి చేసుకోవడం మంచిదనే. ఆడపిల్లలిప్పటికయినా ఇల్లూ వాకిలీ సర్దుకోవడంలో నిమగ్నురాలు కావలసిందే. అయితే యిప్పటి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా కుటుంబంలో ఒక్క మనిషి సంపాదన యెందుకూ పనికి రాదు. అందులో మన కుటుంబాలకు కాస్తో కూస్తో లావాదేవీలు, ముసలి ముతక వ్యవహారం, పిల్లల పెళ్ళిళ్ళు, పురుళ్ళు, పేరంటాలు యిటువంటివన్నీ వుంటాయి. అందుచేత నా వుద్దేశ్యంలో, చేతనయిన వాళ్ళందరూ ఉద్యోగాలు చెయ్యడమే మంచిదంటాను. ఇటు ఆఫీసు, అటు యిల్లూ సర్దుకోవడం కాస్త కష్టమయినవిషయమే అయినా ఈ కష్టానికి తగిన ఫలితం లభిస్తుంది. ముందు ముందు జీవితం సుఖప్రదం అవుతుంది' అని ఒక చిన్నసైజు లెక్చర్ యిచ్చాడాయన.

సుజాతకు మాత్రం ఆఫీసంటే బాగా 'బోర్' అయిపోయింది. ఏంతసేపూ తను యంత్రంలా తయారు కావాలి. ప్రతి క్షణమూ యేదో కొంపలు అంటుకుపోతూ వున్నట్లు హైరానా యింజన్ల కోపం ఏదురు చూస్తూ వున్నట్లు వుండాలి ఆఫీసులో.

'ఈ కాగితం అర్జంటు.

'ఈ ఫైలు యీ రోజు వెళ్ళిపోవాలి.

'ఈ రిజిస్టర్ అప్టుడేట్ చేయాలి.

'ఈ రిటర్న్ పోయిన వారమే వెళ్ళవలసింది.

'ఈ అర్జీకి సమాధానం యింకా ఏందుకు వెళ్ళలేదు?'

— ఇటువంటి మాటలు ప్రతి క్షణమూ చెవులలో పడుతూనే వుంటాయి. ఆఫీసులో వున్నంతసేపూ యేదో 'టెన్షన్' లో వున్నట్లు తప్ప, హాయిగా ఊపిరి పీల్చుకుందుకు కుదరదు.

సుజాత ఆ ఆఫీసులో మూడు సంవత్సరాలు పనిచేసింది. 'స్టెనో'గా మంచి పేరు సంపాదించుకుంది.

వయసు మించిపోతోందని చెప్పి తల్లీ తండ్రీ సంబంధాలు చూడడం మొదలు పెట్టారు. ఇల్లు గడప బయటకు వెళ్ళి యేడేళ్ళు ఉద్యోగం చేయడం వల్ల సుజాతకు ప్రపంచం అంటే ఏమిటో కాస్త తెలిసి వచ్చింది. బొత్తిగా పెద్దవాళ్ళు తీసుకువచ్చిన మనిషి చేత మెడలో తాడు కట్టించుకోవడం తనవల్ల కాదు. కాస్త యోగ్యుడూ, తనను యిబ్బంది పెట్టకుండా చూసుకునేవాడూ అవసరం.

నిజానికి ఉద్యోగం చేయడం సుజాతకు యిష్టంలేదు. అయినా అంతకంటే చేసే పనేమీ లేదుగనుక యిన్నాళ్ళూ అలా ఉండిపోవలసి వచ్చింది. అయితేనేం, ఒక దశలో ఉద్యోగం తప్పనిసరి అయిపోయింది కూడా. నాన్న రిటైరయిపోయి ఆయన 'పింఛను' యెందుకూ చాలక తమ్ముళ్ళ చదువులకోసం ఏక్కడి డబ్బూ చాలనప్పుడు యిల్లు గడవడం కాస్త కష్టంగా తోచింది. అప్పుడు యింటి ఖర్చులకోసం తన డబ్బు బాగా ఉపయోగపడింది. ఇప్పుడు ఆ అవసరాలన్నీ తీరిపోయినాయి కనుక ఫరవాలేదు. తమ్ముళ్ళు చదువులుపూర్తయి వాళ్ళు ఉద్యోగాలు సంపాదించుకుని దిక్కుకొకళ్ళుగా దేశం నాలుగు మూలలకూ వెళ్ళారు. తన సంపాదనవల్లనే కాస్తో కూస్తో ఆ కుటుంబం ఎదురైనటువంటి ఇబ్బందులనుంచి తప్పుకుని నిలదొక్కుకోగలిగింది. తన వివాహానికి తమ్ముళ్ళంతా సంపాదన పోగుచేసి డబ్బు ఖర్చుపెట్టారు. అంటే ఒకరకంగా తన 'ఋణం' తీర్చుకున్నారన్నమాట.

'నీ పెళ్ళి చేసేద్దాం అనుకుంటున్నాడు నాన్న, నీకు ఎలాంటి వరుడు కావాలో యెంచుకో' అన్నది అమ్మ.

ముందు ఈ ప్రశ్న అర్థంకాలేదు సుజాతకు. తను కొండమీది కోతి కావాలంటే తీసుకు వస్తారా? ఎంత ధైర్యం! లేక తమ కుటుంబ పరిస్థితులు, ఆర్థిక వ్యవహారాలు తెలిసిన మనిషిగనుక తను సరయిన మనిషిని, సజావయిన సంబంధాన్ని యెంచుకుంటుందని భరోసానా? తండ్రి ఒకళ్ళు యిద్దరితో అనడం తను ప్రత్యక్షంగా విన్నది. 'మా సుజాత ఈ కాలపు ఆడపిల్లల వంటిది కాదు. కుటుంబ బాధ్యత, బరువు తెలిసిన మనిషి. ఇన్నేళ్ళుగా ఉద్యోగం చేసి అనుభవం సంపాదించింది. అమ్మాయికి యిష్టమయిన మనిషినే వివాహం చేయాలని వుంది. అమ్మాయి మంచితనానికి యింత కన్న మంచి బహుమతి యింకేం యివ్వగలం?' అని.

తన మంచితనానికి రాజముద్ర దొరికినందుకు సుజాత చాలా సంతోషించింది. పోతే, ఏటువంటి వరుడు కావాలని తనను తను ప్రశ్నవేసుకున్నప్పుడు సుజాతకు ఒక్కమాటే వెంటనే సమాధానం దొరకలేదు. డబ్బున్నవాడా? అందమయినవాడా? మంచి మనసున్నవాడా? ఉద్యోగం ఉన్నవాడా? ఆస్తిపాస్తులు ఉన్నవాడా? ఏటువంటి వరుడు కావాలి తనకు?

జీవితాన్ని మనం శాసించుకుందాం అనుకోవడం కంటే ఎప్పటికప్పుడు జీవితం ఏటువంటి అవకాశాలను కల్పిస్తే వాటిని చక్కగా ఉపయోగించుకుని ముందుకు పోవడంలోనే ఎంతో సమాధానం వున్నదని పిస్తుంది, సుజాతకు.

తల్లీ తండ్రీ కేవలం తనమీదనే వదిలి వేయలేదు. మంచివెద్దలను గురించి యోచన చేస్తూ ఒకళ్ళిద్దరు ప్రాస్పెక్టివ్ వరుళ్ళు వచ్చి సుజాతను చూచివెళ్ళే అవకాశం కల్పించారు. సుజాత ఆ కుర్రవాళ్ళను ఆమోదించక పోవడంతో యింక ఆ సంబంధాల విషయం మరచిపోయి యితర ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ సంబంధాలు తన కెందుకు అంతగా నచ్చలేదు? ఆ కుర్రవాళ్ళంటే తనకు ప్రత్యేకమయిన అకర్షణ యేర్పడలేదు. పెళ్ళి అనేది యేమాత్రం ప్రణయాత్మకమయిన ప్రసక్తి లేకుండా కేవలం 'ఆఫీసు నోటీస్' లాగా యాంత్రికంగా తయారయితే యేం బాగుంటుంది? తనను ఆకర్షించుకుని తన హృదయాన్ని అడిగి తాకోగల మనిషి కావాలి తనకు. అదిగాక ఆ యిద్దర్లో ఒకడు తన పెళ్ళి అయిన తరువాత కూడా ఉద్యోగం చేస్తూ వుండాల్సిందేగని వివాహం చేసుకోవడానికి ఎంతమాత్రమూ

# కొత్తనక్షత్రం

పేలులేదని ముందుగానే ఒక షరతు వేశాడు. భలే తమాషాగా అనిపించింది సుజాతకు యీ షరతు!

అవసరం అయితే ఆడపిల్లలు ఉద్యోగాలు చేయవచ్చును అనే దయానిధిగారి 'ఫిలాసఫీ' నుంచి, 'తప్పకుండా చేయవలసిందే' అనే నియమానికి వెంటనే దూకలేక పోయింది సుజాత. అతను యేమీ సంటరివాడు కాదు. పలుగురున్న కుటుంబంలో నుంచి వచ్చిన వాడే- మంచి ఉద్యోగంలోనే వున్నాడు. అయితేనేం భార్య కూడా ఉద్యోగం చేసి కుటుంబ ఆర్థికవ్యవస్థకు తప్పకుండా తోడ్పడాలని అతని ఆలోచన! తప్పనిసరిగా చేయాలని ముందే షరతు వేసేశాడు, తర్వాత యింకా యెన్ని కొత్తరకం నియమాలు తీసుకువస్తాడో! సుజాతకు భయం వేసి యీ సంబంధం వద్దని ఖచ్చితంగా చెప్పేసింది. ఆ తరువాత కొద్దోయే వరుళ్ళను పిలవడంలోనే కాస్త నికార్సయిన వింపిక ప్రారంభించింది.

వాళ్ళ ప్రయత్నాలన్నీ వృధా కాకముందే చంద్రశేఖరం ఆమెను చూడటానికి వచ్చాడు. మనిషి గంభీరంగా దృఢంగా హుందాగా వుంటాడు. ప్లీడరు పరీక్ష ప్యాసయి మూడేళ్ళుగా సీనియరు దగ్గర పనిచేసి యిప్పుడే స్వంతంగా ప్రాక్టీసు ప్రారంభం చేశాడు. మనిషి వెనకాల ఆస్తిపాస్తులు యేమీ లేవు గాని యీ మనిషిలో ఎంతో ఆత్మస్థైర్యం, విశ్వాసం కనిపించాయి సుజాతకు. జీవితం విలాగయినా గడవనీ దాన్ని యీదుకుంటూ పోవడానికి ప్రయత్నం చేయవలసిందే నన్న ధీమా కనిపించింది. సుజాత తల్లిదండ్రులకు కూడా యీ సంబంధం నచ్చింది. వాళ్ళ ప్రత్యేక కారణం యేమిటంటే- ఉన్న ఊళ్ళో సంబంధం, పిల్ల కళ్ళయెదురుగా వుంటుంది; యింతకంటే యింకేం కావాలి?

పెళ్ళిచూపులకు వచ్చినప్పుడు చంద్రశేఖరం సుజాతను అనేక ప్రశ్నలు వేశాడు. తనను కూడా ప్రశ్నలు వేసి కావలసిన సమాచారం సేకరించుకోమన్నాడు. అతని ధోరణి చాల 'స్పోర్టివ్'గా అనిపించింది సుజాతకు.

'మీరు బి. ఏ. ప్యాసయ్యారని తెలుసు. ఫలానా ఆఫీసులో స్టెనోగా వున్నారనీ యెరుగుదును. ఉద్యోగం మీకు యిష్టమేనా?' అని అడిగాడు.

'ఇష్టమూ లేదు, అయిష్టమూ లేదు. ఊరికే ఉండడం ఎందుకని చేస్తున్నాను'

"పెళ్ళి అయ్యాక ఉద్యోగం మానివేస్తారా?"

. 'మీ యిష్టం!' సుజాత యిలా ఎందుకు సమాధానం చెప్పిందో ఆమెకే తెలీదు.

'నా యిష్టంమాట అలా వుంచండి. మీ మనసుకు ఎలా తోస్తోందో చెప్పండి!'

'ఉహూ-చెయ్యను'

'మీ ఉద్యోగం యిబ్బందిగా వుందా?'

'అవును. ప్రొద్దుటంతా పరుగెత్తడంతో సరిపోతోంది. హాయిగా కూర్చుందామా ఊపిరి పీల్చుకుందుకు లేదు.'

'పెళ్ళయి సంసారం మీదపడినా అంతే-మనిషికి ఎప్పుడూ స్వేచ్ఛ లేదు!'

'అయినా ఆ వాతావరణం వేరు. నాది, నా స్వంతం అనే అభిప్రాయం వుంటుంది యింట్లో. ఆఫీసులో అలా అనుకోవడం నాకు చేతకాదు!' అంది సుజాత.

అతను నవ్వి ఊరుకున్నాడు. ఇంకేమీ అనలేదు.

'చూడండి: నాకు కొన్ని దురలవాట్లు వున్నాయి. సిగరెట్లు తెగ కాలుస్తాను, సినిమాలు విక్కువగా చూస్తాను తీరుబడి సమయం అంతా పుస్తకాలు చదవడంతోనే గడిపివేస్తాను. నా ప్రాక్టీసు ఇంకా నిలదొక్కుకోలేదు. ప్రారంభ దశలోనే వుంది. కనీసం పదేళ్ళయినా కష్టపడాలి. నాగా కాంపిటేటివ్ వున్న ప్రొఫెషన్' అన్నాడు.

సుజాత విని వూరుకుంది. ఏమీ ప్రశ్నలు వేయాలని అనిపించలేదు.

చంద్రశేఖరం నిశ్చయతాంబూలాల సమయంలో

> **రచయితలకు మనవి**
>
> జూన్ ఒకటో తారీఖు నుంచి తపాలా రేట్లు మారాయి. ఈ మార్పును గమనించి తదనుగుణంగా తపాలా బిళ్ళలను అతికించి మాకు పంపే ఉత్తరాల్లో ఒంగీలు పొరపాట్లు చేసి రచయితలు పాఠకులు మాతో సహకరించాలని మనవి.
>
> — సం.

'నాకు కట్నం యేమీ అక్కరేదు. ఏమన్నా యివ్వదలుచుకుంటే మీ అమ్మాయికే యిచ్చుకోండి. నాకు అభ్యంతరం లేదు. వివాహం కూడా ఎంతో 'సింపుల్' గా చేయండి' అన్నాడు. ఇంకోకళ్ళయితే అతన్ని చేతకానివాడికింద జమకట్టేవాళ్ళే మోగాని సుజాతకు మాత్రం అలా అనిపించలేదు.

తనే స్వయంగా శుభలేఖలు పంచిపెట్టి ఆఫీసులో వాళ్ళనందరినీ ఆహ్వానించింది సుజాత.

'అదృష్టవంతురాలవు' అన్నారు అందరూ. నిజంగా యీ అదృష్టం ఎలా వుంటుందో ముందు ముందు చూడాలి అనుకుంది సుజాత.

దయానిధి ఇన్విటేషన్ కార్డు తీసుకుని 'అయితే ఉద్యోగం మానివేస్తావన్నమాట!' అన్నాడు.

''అవునండీ. అలాగే అనుకుంటున్నాను.''

'నా మాటవిను. అప్పుడే రాజీనామా యివ్వకు. ముందు కొద్దిరోజులు సెలవు తీసుకో. సెలవు అయిపోయే లోపల యేదో నిర్ణయించుకోవచ్చును. అంత తొందరపడి నిర్ణయం తీసుకోవడం ఎందుకు? ఇంతకూ చంద్రశేఖరం అభిప్రాయం ఎలా వున్నదో!'

తరువాత తాను రాజీనామా ఉత్తరం చూపించడంతో దయానిధి మళ్ళీ యీ ప్రస్తావన తెచ్చాడు.

'నువ్వు తొందరపడుతున్నావు. నీ రాజీనామా నేను అంగీకరించడం లేదు.'

'మీ యిష్టం. నేను మాత్రం ఆఫీసుకు రాను.'

'యేం? ఇక్కడ యీ ఆఫీసులో నీకు చెరసాలలో వున్నట్లుగా వుందా? నేనేం యముడిలాగ కనిపిస్తున్నానా? నా నుంచి దూరంగా పోవాలని యెందుకాతొందర?'

సుజాత నవ్వి వూరుకుంది. ఉత్తరం మటుకు ఉపసంహరించుకోలేదు.

వివాహం అయిన తర్వాత సుజాత తిరిగి ఆఫీసు గుమ్మం తొక్కలేదు. ఉద్యోగానికి రాజీనామా యిచ్చానని చంద్రశేఖరంతో చెప్పింది. అతనేమీ మాట్లాడలేదు. నవ్వి వూరుకున్నాడు.

కొత్తగా కాపురం పెట్టిన తర్వాత దయానిధి వచ్చాడు ఒకమారు చూడడానికి. 'ఏం చేస్తున్నావు సుజాతా?' అన్నాడు తను యిచ్చిన కాఫీకప్పు చేతిలోనికి తీసుకుంటూ.

'ఇంకా ఏమీ రొటీన్ తయారు చేసుకోలేదు. ఇప్పుడు బోలెడంత టైం నాకు.'

'అదే! ఈ టైమంతా యేం చేస్తావు? ఎలా గడుపుతావు?'

'ఇంటిపనులు యింకా నాకు బాగా అవగాహనకాలేదు. అవి నేర్చుకోవడం, ఒక పద్ధతిలో పెట్టుకోవడం కొంత టైం పడుతుందనుకుంటాను—' అంది. యింకా వివరంగా యేం సమాధానం చెప్పాలో స్ఫురించక.

'సరే. మీరు యిద్దరే గదా! ఇంటిపనులు యేపాటంత పెద్దగా వుంటాయి. ఉదయం ఓ గంట, సాయంత్రం ఓ గంట చాలను కుంటాను. తతిమ్మా టైము అంతా యేం చేస్తావు?' ఆయన యిలా గుచ్చిగుచ్చి అడగడం సుజాతకు చికాకుగా తోచింది. కోపంగా సమాధానం చెబుదాం అనుకుంది గాని, పెద్దవాడుగదా— యెందుకు చిన్నబుచ్చటం అని వూరుకుంది. ముఖం మీదకు నవ్వు తెచ్చుకుని ''స్నేహితురాళ్ళకు ఉత్తరాలు వ్రాస్తాను. నవలలు, కథలు, నాటకాలు చదువుతాను. ఇన్నాళ్ళూ కూపస్థ మండూకంలా వున్నాను. ఇప్పుడు కాస్త ప్రపంచజ్ఞానం పోగుచేసుకుందుకు ప్రయత్నిస్తాను... రేడియో వింటాను. సంగీతం నేర్చుకుంటాను... సినిమాలు చూస్తాను' అంటూ ఒక్క బిగిని చెప్పేసింది.

ఈ సమాధానం దయానిధికి రుచించి నట్లు లేదు, ఆయన వాలకం చూస్తే. కాని యింకేం మాట్లాడకుండా సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు, పుణ్యాత్ముడు!

ఎవరి అభిప్రాయాలు వాళ్ళకు రుచికరంగా వుంటాయి. అందుకు కారణం అవి తమవి కావడమే తప్ప యింకేం వుండదు—అనుకున్నది సుజాత.

మళ్ళీ టైం చూసుకుంది.

తొమ్మిది అయింది! గంటసేపటినుంచి తాను యేం చేస్తున్నట్టు? ఊరికే గతాన్ని నెమరు వేసుకుంటూ బద్ధకంగా వుండిపోయిందా?

అబ్బబ్బ! మళీ పదిన్నర అయితేఆయన యింటికి వచ్చేస్తారు. కాస్త టిఫిన్ తయారు చేయాలి. ఆయన కోర్టుకు వెళ్ళిపోతారు. సుజాత గబగబ దుప్పటి పక్కకు నెట్టేసి మంచం దిగింది.

*　　*　　*

చంద్రశేఖరానిదంతా నియమబద్ధమయిన జీవితం తొమ్మిది, తొమ్మిదిన్నర అవడంతోటే తన స్వంత పనులన్నీ ముగించుకుని ముందు గదిలోనికి (అదే ఆఫీసుగది) వెళ్ళిపోతాడు. రెండుగంటలసేపు యీరోజు వున్న కోర్టు వ్యవహారం చూసుకోవడంతో సరిపోతుంది. గుమాస్తా, టైపిస్టు వచ్చి కావలసిన కాగితాలు సర్దుకుంటారు. క్లయింట్లు వచ్చి మాట్లాడి వెడతారు. పదిన్నరదాకా యీ తతంగమంతా నడుస్తుంది. అప్పుడు కాస్త గట్టిగా 'టిఫిన్' చేసేసి కోర్టుకు వెళిపోతాడు. ఆ వెళడం, తిరిగి రావడం ఒకటిన్నర రెండుగంటల ప్రాంతంలో ఎక్కువపని లేకపోతే ఒంటిగంటకి



# కొత్తనక్షత్రం

వచ్చేస్తాడు. అప్పుడు భోజనంచేసి ఒక గంటసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ కోర్టుకు వెడతాడు. నాలుగున్నరకల్లా తిరిగివస్తాడు. సాయంత్రం యేమీ పనివుండదు. ఇద్దరూ షికారుకు వెడతారు. పనినిబట్టి అవసరం అయితే ఒక్కోసారి రాత్రి తొమ్మిదింటికి వస్తాడు. అతనికో గంట, రెండుగంటలు డిక్టేషన్ యివ్వడంతో సరిపోతుంది. ప్రతిరోజూ యేదో ఒక కేసుకు ఎఫిడవిట్లు, స్టేట్‌మెంట్లు తయారు చేయవలసినవి వుంటాయి. ఈ పని అయిన తర్వాత మరునాటి కేసులు ఒక గంట 'స్టడీ' చేసుకుంటాడు. పదిన్నర, పదకొండు గంటలకు గాని పడుకోడు. దాదాపు ఒక ఆఫీసులాగ, యిలా నియమంగా చేసుకోకపోతే తెమలదు. ఎప్పటిపని అప్పుడు చూసుకోకపోతే పార్టీలతో వేగటం కష్టం. వాళ్ళను ఆకట్టుకోవడం కుదరదు. పార్టీలసహకారం లేకపోతే యీ వృత్తి జరగడం కష్టంగదా! ఒక్కొక్కసారి క్లిష్టమయిన కేసుల్లో పార్టీలతో రాత్రిపూటలు కూడా సమాలోచనలు జరపాల్సి వుంటుంది.

సుజాత వివాహ జీవితం ప్రారంభించి మూడు నెలలయింది. చంద్రశేఖర్ ఆమెను ప్రాణసమానంగా చూసుకుంటున్నాడు. అన్ని విషయాలలోను ఆమె అభిప్రాయాలకు విలువ యిస్తాడు. ఇంటి యాజమాన్యం అంతా ఆమెదే. ఆమె చేసే పనుల్లో పొరపాట్లు వచ్చినా చూసీ చూడనట్టు వూరుకుంటాడు.

సుజాత ఎక్కువసేపు బద్ధకంగానే గడుపుతుంది. తనకు బోలెడంత సమయం విరామం వుంది; కాలమంతా యిప్పుడు తన చెప్పుచేతల్లోనే వుంది. దేనికీ తాను తొందర పడి పరుగులు తీయవలసిన అవసరం లేదు — అనే ఆలోచనలు ఆమెలో బాగా జీర్ణించుకు పోయినాయి. చంద్రశేఖరం కూడా ఆమెను ఏమీ అనకపోడం వల్ల యీ ఆలోచనలు మరింతగా ఆమెలో స్థిరపడి పోయినాయి.

లేచి తిరిగినంతసేపూ ఉత్సాహంగానే వుంటుంది గాని, అసలు లేవటానికే బద్ధకం!

ఉదయం సరేసరి! తొమ్మిదిన్నర అయిన తరవాతనే లేవడం. ఏదో చకచక తన చేతులలో వున్న వస్తువులతో యింత టిఫినూ, కాఫీ తయారుచేసి ఆయన్ను పదిన్నరకల్లా కోర్టుకు పంపివేయడం అవుతోంది. ఇప్పటి నుంచి వంటచేస్తే — పదార్థాలన్నీ ఆయన వచ్చేసరికి చప్పగా చల్లారి పోతాయని కాస్సేపు ఎలాగో బద్ధకంగానే వుండికదా అని కూర్చుండి పోయేది. ఏవేవో ఆలోచనలు మనసును ముంచేస్తూ వుండేవి. తీరా యీ ఆలోచనలనుండి తేరుకుని యివతలి పడేసరికి పన్నెండు గంటలయి పోయేది. అప్పుడు ఆదరా బాదరా వంట ప్రయత్నం ప్రారంభించి ఆయన వచ్చేసరికి ఎలాగో పూర్తి అయింది అనిపించేది.

## జన్మ !

ఈ మానవ లోకంలో !
అరిషడ్వర్గాల బంధంలో
ఆశాసుందరి కౌగిల్లో
ఆరని ఆకలి గవ్వల్లో
అనంత శోకపరితప్త
హృదయంతో —
కుమిలి కృశించి
పోవడం కంటే —
ఈ పచ్చని ప్రకృతిలో
ఒక్క పూమొక్కనై పుట్టి
విరిసి ! పరిమళించి...
నవ్వుల పువ్వులు రాల్చిపోతె —
జన్మ ఎంత చరితార్థమయ్యేది!!

— డి. సి. కేశవరావు.

భోజనం చేసిన తర్వాత ఎలాగూ యేమీ పనిలేదు గదా అని కాస్సేపు కునుకు తీయాలని చూసేది. ఈ కునుకునుంచి తేరుకునే టప్పటికి సాయంత్రం అయిపోయేది. చంద్రశేఖరం వచ్చి షికారుకు తీసుకువెళ్ళే వరకూ అలాగే వుండిపోయేది.

మొదట్లో యేదో కొత్తగా దొరికిన విరామ సమయంలే అని చెప్పి విశ్రాంతి తీసుకోవడం ఆరంభిస్తే — యిదే ఒక సమస్యగా తయారయింది రానురాను.

రాత్రిపూట వంట చేయాలంటేనే బద్ధకంగా వుండేది. అరగంట, గంట అటు యిటు తిరిగి రావడంవల్ల కొత్తగా బడలిక యేర్పడేది

క్రమంగా చంద్రశేఖరం ఓపికకు కూడా పరిమితి యేర్పడుతూ వచ్చింది. మొదట్లో చూసీ చూడనట్టు వుండేవాడు — కాస్త చిరాకు ప్రదర్శిస్తూ వస్తున్నాడు. అన్నీ సమయానికి అమరుతూవుంటే ఉత్సాహంగా పనులు చేసుకుంటూ పోవచ్చును. తగినంత కారణం లేకుండా అన్నీ యిలా ఆలస్యం అవుతూ వుంటే — ఆఖరుకు భోజనం విషయంలోనూ ఆలస్యం జరుగుతూ వుంటే — అతనికి సహించరానిదయిపోయింది. ఎంత అణుచుకుందామన్నా అసహనం పొగలు పొగలుగా బయటకు వస్తూవుండేది

తన స్తబ్ధతకు కారణం యేమిటో యెంత ఆలోచించినా సుజాతకూ తెలియకుండా పోతోంది. పోనీ బోలెడు పని చేసుకుని ఒక్కతే అవస్థ పడుతోందా అంటే — అసలు పనంతా యెంతగనుక? దీనిలో మళ్ళీ తనకు సహాయం చేసే వాళ్ళంటూ యిద్దరు పనిమనుషులు వుండనే వున్నారు

తన బద్ధకంవల్ల రాను రాను యిద్దరికీ వైమనస్యం యేర్పడుతోందేమోనన్న భయం కూడా యేర్పడసాగింది సుజాతకు.

ఎంత ఆలోచించినా యిందుకు కారణం, తరుణోపాయం యేమిటో స్ఫురించలేదు. తీరుబడి దొరికితే తను యెన్ని పనులయినా చేయాలనుకున్నది. తీరుబడికోసం ఎంతగానో తెంపర్లాడింది. తనపనులు తను చేసుకుంటూ తీరిక సమయంలో హాయిగా విశ్రాంతి తీసుకుంటూ యే నవల చదవడమో, రేడియో వినడమో, ఉత్తరాలు వ్రాసుకోవడమో చేసుకుందామనుకుంది. కనీసం స్నేహితురాళ్ళ ఉత్తరాలకు బదులు వ్రాయడానికి అయినా కుదరకుండా పోతోంది. ఇదివరకే నయం — అంత ఆఫీసు పనిలోనూ ఓ పది, పదిహేను నిమిషాలు దొంగిలించి తన స్నేహితురాళ్ళకు 'ఉభయకుశలోపరి' ఉత్తరాలు వ్రాస్తూ వుండేది. ఏదైనా మాగజైన్సూ, నవలలూ చదువుకుంటూ వుండేది. ఇప్పుడు అలాంటి పని యేమీ చేయకపోగా, యిలా బద్ధకం పెరిగిపోయి ఒక సోమరిపోతులాగ తయారయిపోతోంది.

దీనిని గురించి నేరుగా చంద్రశేఖరంతో

ప్రసావించడమే బుద్ధికి లక్షణంగా తోచింది సుజాతకు.

'ఏమండీ నాకు తోచడంలేదు. ఉట్టి సోమరిపోతుగా తయారయి పోతున్నాను.'

'మంచిదేగా!' అన్నాడతను నవ్వుతూ.

'అలా కాదు. సీరియస్‌గా చెబుతున్నాను. నాలో యేదో లోపం వుంది. నాకు తెలియడం లేదు చెప్పండి.'

'నీలో లోపాలు నాకేంకనిపించడంలేదు.'

'అలా కాదు. ఇదివరకు బోలెడంత పని చేయగలిగేదాన్ని. నిమిషం విరామం లేకుండా బంతిలా తిరుగుతూ వుండేదాన్ని. ఆ చురుకుదనం, చలాకీతనం యిప్పుడు యేమయిపోయినాయో నాకు తెలియడంలేదు'

'బహుశ యిప్పుడు అంత చురుకుతనం అక్కర్లేదేమో!'

'పోతే పోనీయండి. మన్నుతిన్న పాములాగ తయారవుతున్నాను గదా!' అంది సుజాత యింకా కుంగిపోతూ.

'అయితే యేం చేస్తానంటావు?'

'అదే నాకు అర్థంగాక కొట్టుకుంటున్నాను యెన్నో పనులు చేయాలనుకుంటాను. కాని ఒక్కటీ చేయలేకపోతున్నాను.'

'అనాసక్త యోగం!'

'మీరలా వేళాకోళం చేస్తే నాకు నిజంగా కోపం వస్తుంది' అంది సుజాత మూతి ముడిచి పెట్టి.

చంద్రశేఖరం ఆమెను మరింత దగ్గరగా లాక్కొని ప్రగాఢంగా ముద్దు పెట్టుకుని 'యేమీ బేజారు పడకు డియర్! నాలుగు రోజులు యిలాగే వుంటుంది. తరువాత అంతా సర్దుకుపోతుంది. ఊరికే ఖంగారుపడి లేనిపోని సమస్యలు వెదికి తెచ్చుకోకు' అన్నాడు

ఆ సంభాషణ అంతటితో సమసిపోయినా సుజాత మనస్సు మాత్రం యీ విషయంలో యేమాత్రం రాజీకి రాలేకపోయింది.

లాభంలేదు. తను యిలాగే వుండిపోయేట్లయితే తన వంటికీ, యింటికీ కూడా మంచిది కాదు ఏదో చేసి తీరాలి. తన బుర్ర పూర్తి 'డెవిల్స్ వర్క్‌షాప్' కాకముందే దానికేదో పని నియమించాలి. యిప్పుడూ స్త్రీసామీప్యమే యెరగని కుర్రవాడికి యేకంగా రూపాయికాగితం అందిస్తే యెలా ఉక్కిరి బిక్కిరి అయిపోతాడో, అయోమయంలో పడిపోయి యెంపరాడతాడో అలా వుంది తన స్థితి యిప్పుడు.

ఆమె యిలా బాధపడుతున్న రోజుల్లోనే దయానిధి వాళ్లను చూడటానికి వచ్చాడు. సుజాతను చూచి ఆశ్చర్యపోయినాడు.

'అదేమిటమ్మా! అలా చిక్కిపోయావు?' అన్నాడు నిర్ఘాంతపోయి.

'ఆమాటె నేనంటే యేమీలేదని కొట్టిపారేస్తోంది సుజాత. ఇప్పుడు మీరు యిలాగే అంటున్నారు' అన్నాడు చంద్రశేఖరం ముసిగా నవ్వుతూ.

'యేమీ పనిలేక చిక్కిపోయానండీ. సోమరితనంతో లావు యెక్కడానికి బదులు నీరసించి పోతున్నాను' అంది సుజాత.

'నేను ముందేచెప్పాను సుజాత! ఇంత తీరుబాటు నీ వంటికి పడదు. యిప్పుడూ పనిలో నిమగ్నమయి నియమబద్ధంగా నిమిషాలు గడిపివేయడానికి అలవాటు పడిపోయినావు, యేడుసంవత్సరాలలోను. ఇప్పుడు ఉరికే కూర్చుంటావంటే అవుతుందా?'

—సుజాతకు తన పరిస్థితికి 'క్లూ' దొరికినట్లయింది. పైకి మాత్రం యేమి తేలకుండా యేదో కులాసా కబుర్లు చెప్పడంలో మునిగిపోయింది. దయానిధి వెళ్లిపోతూ 'నువ్వు మళీ పనిలో చేరాలనుకుంటే నాకేం అభ్యంతరంలేదు. మంచిరోజు చూచుకుని వచ్చేసెయ్యి—' అన్నాడు.

అతని మాటలకు ముగ్గురూ నవ్వుకున్నారు.

ఆరోజు రాత్రి సుజాతను దగ్గరకు తీసుకుంటూ చంద్రశేఖరం 'ఏం, రేపట్నుంచి ఆఫీసుకు వెడతావా?' అన్నాడు.

'ఆ'

'నిజం?'

'వెడతాను. కాని ఆ ఆఫీసుకు కాదు. లాయర్ చంద్రశేఖరంగారి ఆఫీసుకు. ఆయనకు పెర్సనల్ సెక్రటరీ పని నాది! లాయర్‌గారి ఎపాయింట్‌మెంట్స్, ఎంగేజ్‌మెంట్స్ డైరీ, కోర్టు డైరీ — యివన్నీ అప్‌టు డేట్‌గా వుండేపని నాది! రేపటి నుంచి స్టెనోను రావక్కర్లేదని చెప్పండి. ఆ పనంతా నా చేతిమీదుగా చేసేస్తాను!'

'ఎందుకు సుజాతా; లేనిపోని బెడద పెట్టుకుంటావు నువ్వు?'

'కాదులెండి. నేను చేయగల పనిలో పదోవంతయినా చేయకపోవడంవల్లనే నాకీ సోమరితనం వచ్చింది.'

'నీ యిష్టం.'

'కాని ఓ మనవి! ఈ సెక్రటరీ తప్పులు చేస్తే మటుకు మీరు క్షమించగూడదు. ఉంగరాల వేళతో మొట్టితేగని మీ సెక్రటరీకి మతి సరిగ్గా వుండదు' అంది సుజాత.

ఇద్దరూ మనసార నవ్వుకున్నారు.



## చోళీ పూజ!

మధ్యప్రదేశ్‌లోని సెహోర్ జిల్లాకు చెందిన వెనుకబడిన జాతుల వారిలో ఒక జాతి వారు వెలికి వా రోజా దేవీ పూజ జరుపుతారట. ఈ పూజలో దేవికి పెద్ద సారాయి కుండ నైవేద్యం పెట్టి ఆ సారాలో వయస్సులో ఉన్న ఆడవారు తమ రవికలు విప్పి ముంచుతారట. అనక వయస్సు పురుషులు ఒక్కొక్కరూ ఒక్కొక్క రవిక చేతికందినది ఎన్నుకుంటారట. ఏ యువకుని చేతికి ఏ రవిక వస్తుందో ఆ రవిక సొంత దారిణి అయిన స్త్రీ ఆ రాత్రి అతనికి సొంతమట. ఈ ఆటలో వయస్సులోవున్న స్త్రీ పురుషులు మాత్రమే పాల్గొం



టారట. పెళ్లి అయిన వారూ, అవనివారు కూడా పాల్గొంటారట. వీరంతా ఆ దేవి చుట్టూ ఉన్న చెట్లలో బాహాటంగా రతి క్రీడ జరుపుకుంటారట. ఈ పండుగకు చోళీ పూజన్ అని కూడా పేరట. పేరులో ఏముంది అనుకుంటాంగానీ పేరులో కూడా ఉన్నట్టే ఉంది కదా!

## సినిమా పద్ధతి పెళ్లి!

మధురైకి చెందిన నారాయణన్ అనే ఓ లక్షాధికారి తన భార్యతోనూ, ఏకైక పుత్రికా రత్నంతోనూ ఓ సినిమాకి వెళ్లాడట. ఆ పుత్రికారత్నం బాల్కనీనుంచి క్రిందికి ఒయ్యారంగా ఒంగి చూడబోయి కాలు జారి ఎగిరి ధామ్మని క్రింద పడిందట. క్రింద తరగతిలో కూర్చొని ఉన్న ఓ హీరో అమాంతం ఆమెను రెండు చేతుల్లోనూ క్రింద పడకుండా లాఘవంగా పట్టుకున్నాడట. ఫక్తు సినిమా పద్ధతిలో ఆ సునీత ఆ యువకుణ్ణి వాటేసుకోడంలో అప్పటికప్పుడే ప్రేమ ఉదయించి ఆ హీరోని చేసుకుంటానని ఒంటికాలు మీద నిలబడిందట. దాంతో ఆ లక్షాధికారి ఆమె కోర్కె నెరవేర్చాడట.

## తనకోపమె తనమిత్రుడు!

అమెరికన్ మనస్తత్వ శాస్త్రవేత్త డాక్టర్ ఎడాల్ఫ్ జోనాస్ మనిషికి కోపం చాలా అవసరమనీ, మనిషి కోపంలో ఉన్న సందర్భంలో మెదడు కొన్ని రకాల ద్రవ పదార్థాలను విడుదల చేస్తుందనీ, తద్వారా తలనొప్పి, వీపు నొప్పి, కడుపు నొప్పివంటి రోగాలు దివ్యంగా నయమవుతాయనీ ప్రకటించారట. కోపం రాని మనిషికి మెదడులో యీ అద్భుత ద్రవం తయారు కాదని కూడా ఆయన వివరించారట. కనుకనా చదువరీ, బీయాంగ్రీ!!య్యా!

## రహస్య ప్రేమాయణ రామాయణం!

కళ్లకుర్చికి చెందిన నారాయణపట్టి అనే గ్రామంలో చిన్న తంబి అనే అతని కూతురు 20 ఏళ్ల పాప్పాత్ అదే వూరుకు చెందిన వెళ్లి అనే ఓ కుర్రాడితో రహస్య ప్రేమాయణం పెట్టుకున్నదట. పెళ్లయిన దానిని నీకెందుకు పోయే కాలం అని ఆమె తల్లి కేకలేసే సరికి తన ప్రియునితో ఆమె లేచి పోయిందట. ప్రియుడూ ఆమె కలిసి పొన్నాచిటి కొండల మీద మకాం పెట్టారట. ఈ విషయంగా చిన్నతంబి వూరు పంచాయితీలో వెళ్లి కుటుంబాన్ని రచ్చకీడ్చాడట. దాంతో వెళ్లికి కోపం వచ్చి మారియమ్మ పండుగనాడు తన బలగంతో నారాయణపట్టి వెళ్లి చిన్న తంబి బలగాన్ని చితక బాదాడట. ఈ బాదుడులో ఈటెలూ, బాణాకర్రలూ, తుపాకులూ కూడా వాడారట. ఓ తుపాకి దెబ్బకు చిన్న తంబి హరీ మన్నాడట. నాటి రామాయణ మహా భారతాల నుంచి నేటి వరకూ భీభత్స కాండకు ఒక స్త్రీ కారణంగా ఉంటూనే ఉన్నదికదా! కాదా!

## వింత ఆవుదూడ!

కర్నాటక రాష్ట్రానికి చెందిన హెగ్గడెవన్ కోట అనే వూరిలో ఒక ఆవుకి పుట్టిన దూడకు అరుతళ్లూ, ఒకేకన్నూ వున్నాయట. ఆ దూడ చర్మం ఏనుగుచర్మంలా వుండి, ముఖం విచిత్రంగా కోతిముఖంలా వున్నదట. ఈ దూడ సజీవంగా పశువుల ఆసుపత్రిలో పరీక్షార్థం వుంచబడినదట.

## అందమైన అమ్మాయిల జుట్టు నైవేద్యం!

బోబ్ జిల్లాకు చెందిన అమోదీ అనే గ్రామంలో ఒక యువకుడు ప్రభుత్వ బస్సులో ఒక అమ్మాయి జుట్టు గొరుగుతూ పోలీసుల కంట పడ్డాడట. ఆ అమ్మాయి నోటికో ప్లాస్టరువేసి, చేతులు వెనక్కి కట్టేసి ఆ కుర్రాడు ఆమెకు కేశ ఖండన చేస్తున్నాడట. ఏమిటీ వింత అని ఆ కుర్రాణ్ణి నాలుగు తన్నేసరికి ఆశ్చర్యకరమైన విషయం బయటపడ్డదట. 120 మంది అందమైన వివాహం కాని అమ్మాయిల జుట్లు కత్తిరించి కొడియార్ అనే అమ్మవారికి నైవేద్యం పెట్టే తన తల్లి చనిపోయి, తనకు సకల సంపదలూ కలుగుతాయని తానా యజ్ఞం ఆరంభించినట్టూ అప్పటికి 22మంది అమ్మాయిల జుట్లను అమ్మవారికి నైవేద్యం పెట్టినట్టూ ఆ యువకుడు ప్రకటించాడట. హోరి పిడుగా!

# బొమ్మల మహాభారతం — కౌరవుల ఘోష యాత్ర — మండపాక సీతారామాంజనేయులు

(గత సంచిక తరువాయి)

























[ఇంకా వుంది]

సీరియల్

# ఇది ఒక పాంథశాల

శ్యామల

( గత సంచిక తరువాయి )

యుద్ధంలో గూఢచారుల పాత్ర చాలానే వుంటుంది. అవతలివారి ప్లాన్స్, ప్రోగ్రామ్స్ తెలుసుకోవటమేకాక, మన దేశంలో వారి గూఢచారు లెవరయినా వున్నారేమోనని వెతకటంకూడా చాలా ముఖ్యం.

ఒక ఉదయం 'కోడ్ లాంగ్వేజ్'లో ఒక వార్త వచ్చింది విజయ్ ఆఫీసుకి, ''సరిహద్దుకి మనవైపున వున్న ఒక గూఢచారుల గాంగ్ గురించి వివరాలు చూచాయగా తెలిశాయి. తగిన చర్య తీసుకోండి'' అంటూ వివరాలు వచ్చాయి.

వెంటనే 'ఇంటలిజెన్స్ బ్రాంచ్'కి చెందిన ఒక ఆఫీసర్ని విమానంలో అక్కడకు పంపించారు. ఆ విమానంలో ఆఫీసర్‌తోపాటు ఒక పైలట్, విజయ్ కూడా వెళ్ళాలని నిశ్చయమయింది.

ఆఫీసర్ చెప్పిన చోటుకి దగ్గర్లోనున్న ఒక చిన్న ఎయిర్‌పోర్ట్‌లో విమానం ఆపాడు పైలట్. ఆయన దిగి వెళ్ళిపోయాడు. కొన్ని గంటల్లో తిరిగి వస్తానని చెప్పి, జీప్‌లో వెళ్ళిపోయాడు.

చెప్పినట్టుగానే మూడుగంటల తర్వాత తిరిగివచ్చాడు ఆఫీసర్. ప్లేన్ ఎక్కుతూనే వైర్‌లెస్‌లో తన బాస్‌కి మెసేజ్ పంపించాడు. ''ఆ గాంగ్ గురించిన వివరాలన్నీ నిజమే. ఇంకా ఎన్నో విలువయిన సీక్రెట్స్ తెలుసుకున్నాను. వాళ్ళ ఫైల్స్ కొన్ని కాజేయగలిగానుకూడా !''

''ఇంత త్వరగా పని అవటం వండ్రఫుల్'' అన్నాడు ఆ బాస్.

అకస్మాత్తుగా శత్రు విమానం ఈ విమానాన్ని వెంబడించసాగింది.

''తప్పించుకొనే మార్గం ఒక్కటే ! ఎక్కడో అక్కడ ప్లేన్ దింపేస్తాను (క్రాష్ లాండింగ్). అప్పుడు మన ముగ్గురిలో ఒకరిద్దరయినా బ్రతికే అవకాశం వుంటుంది. ఆ వెనకాల నున్న ప్లేన్ మన పైకి ఆయుధం విసిరిందంటే ముగ్గురం క్షణాలమీద చనిపోతాం!'' అన్నాడు పైలట్.

అతని అభిప్రాయంతో ఏకీభవించక తప్పలేదు విజయ్‌కి.

''చూడు, అతను సీక్రెట్స్ తెలుసుకొని వచ్చాడు. ముఖ్యమైన ఫైల్స్‌కూడా సంపాదించుకు వచ్చాడు. అతను చనిపోతే ఆ రహస్యాలు మన వాళ్ళకు ఎలా తెలుస్తాయి? అతను బ్రతకటం చాలా ముఖ్యం'' అన్నాడు విజయ్.

''యస్, బ్రదర్! గుడ్‌లక్'' అని విజయ్‌తో నవ్వుతూ అని ప్లేన్ దింపేయటానికి సిద్ధమయాడు పైలట్.

''గుడ్‌లక్.'' విజయ్ కూడా చిరునవ్వుతో అంటూనే పైలట్‌కి సాయపడుతున్నాడు. క్రిందికి మెసేజ్ ఇచ్చాడు, తమ నిర్ణయం గురించి.

ఇదేమీ తెలియని ఆఫీసర్ హాయిగా వెనక సీట్లో కూర్చొనివున్నాడు, కాగితాలు చూసుకుంటూ.

వెనక్కి వెళ్ళి అతనికి చెప్పే టైమ్ లేదు. ప్లేన్ క్రిందికి దిగుతూనే అతను బయటకు దూకేస్తాడని ఆశించాడు విజయ్.

పెద్ద చప్పుడుతో మట్టిలో దిగబడింది విమానం.

గుప్పున మంటలు లేచాయి.

శరీరం కాలిపోతున్నా బయటకు దూకేశాడు పైలట్. అంతదూరాన స్పృహతప్పి పడిపోయాడు.

విజయ్‌కి చుట్టూ మంటలు, వేడి. అయినా బయటకు దూకగలడు ... దూకబోయాడు ... ఒక్కసారి వెనుదిరిగి చూశాడు ... ఆ ఆఫీసర్ చుట్టూ మంటలేమీ లేవు ... అయినా షాక్ తిన్నట్టు అలాగే కూర్చొనివున్నాడు ... రెండు క్షణాల్లో మంటలు అతన్ని సమీపిస్తాయి ... అతను, కాగితాలు కాలిపోవటం తథ్యం...ఒళ్ళంతా మండిపోతున్నది విజయ్‌కి ... బాధ భరించలేక పోతున్నాడు .. అయినా బయటకు దూకలేదు ... రెండంగల్లో అతన్ని సమీపించి లాగి బయటకు విసిరేశాడు ... తర్వాత తాను బయటకు దూకటానికి శక్తి మిగల్లేదు ... అతికష్టంమీద ఎలాగో ఇవతలకు వచ్చాడు ...

స్పృహతప్పిపోతుంటే తోటి వ్యక్తిని కాపాడానన్న తృప్తి, దేశపు గెలుపుకొరకు అవసరమయిన రహస్యాలు కాలిపోకుండా చూడగలిగానన్న ఆనందం అతన్ని ఆవరించాయి.

నిమిషాలపైన అంబులెన్స్‌లు, డాక్టర్లు, నర్సులు వచ్చేశారు.

ఆఫీసర్ బ్రతికి బయటపడ్డాడు గాయాలయినా ఆట్టే లేకుండా.

పైలట్‌కి ఒళ్ళు కాలటమే కాక, కొన్ని ఎముకలు కూడా విరిగాయి. కాని ప్రాణాపాయం లేదు.

విజయ్ మరణించాడనే అనుకున్నారు మొదట చూసినవాళ్ళు. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే కొనఊపిరి వున్నట్టు తెలిసింది.

వెంటనే హాస్పిటల్‌కి తీసుకువెళ్ళారు వాళ్ళిద్దరినీ.

## 10

ప్రతిరోజులాగనే ఎయిర్‌ఫోర్స్ ఆఫీసుకి వెళ్ళింది సంధ్య ఆ ఉదయం. ఎప్పటికప్పుడు చనిపోయినవారివి, గాయపడినవారివి లిస్ట్‌లు వస్తూవుంటాయి అక్కడికి. రోజూ వెళ్ళి ఆ లిస్ట్‌లు చూడటం, గుండె దడదడలాడుతుంటే విజయ్ పేరు వున్నదేమోనని వెతకటం, ''అమ్మయ్య!'' అని నిట్టూర్చి లేచి రావటం — ప్రతి దినం చేస్తున్న పని యిది. సంధ్య ఒక్కర్తే వెళ్ళటం ఇష్టంలేక నిర్మల కాని, రవి కాని తప్పనిసరిగా ఆమెతో వెళ్తారు.

సంధ్యకు రాత్రి, పగలు తేడా కూడా తెలియకుండా రోజులు గడుస్తున్నాయి అక్క, బావ బలవంతంపైన ఏదో భోజనం చేశావని పించటం, ఆపైన ఆలోచిస్తూ కూర్చోవటం, ఇదే దినచర్య అయింది. మనిషిలో హుషారు లేదు, చలాకీదనం లేదు. విజయ్ వెళ్తూ వెళ్తూ, సంధ్యలో ముఖ్యమైనది ఏదో వెంట తీసుకు వెళ్ళిపోయాడనిపిస్తుంది చూసేవాళ్ళకి. నిర్మలతో, రవితో కబుర్లు చెప్పటం మానేసింది. చివరికి రాధను కూడా దగ్గరకు తీయటం లేదు. ప్రాణంలేని బొమ్మలా కూర్చొనివుండే సంధ్యను చూస్తే రాధకూ భయమనిపిస్తుందికాబోలు, ఎప్పుడూ నిర్మల వద్ద, రవి వద్ద కాలం గడుపుతున్నది.

రోజురోజుకి మరణించినవారి లిస్ట్ పొడుగవు తున్నది. సంధ్యలాగే ఆ ఆఫీసుకు వచ్చేవాళ్ళు ఎందరో వున్నారు. వాళ్ళలో కొందరు కన్నీటితో, కొందరు చిరునవ్వుతో బయటకు వస్తారు.

***జరిగిన కథ-10 :*** అక్క నిర్మల, బావ రవిల సంరక్షణలో ఉంటున్న సంధ్యకు 'అట్టావా'లో ఉద్యోగం రాగా విజయ్‌కి తనకు జరిగిన వివాహ పూర్వాపరాలు గుర్తుకువస్తాయి. నిర్మలను చూడటానికి వచ్చినపుడే మనసులు కలిసి రిజిష్టరు మేరేజి చేసుకున్న విజయ్, సంధ్యల జీవితం సాఫీగా సాగుతుండగా, విజయ్ మిలటరీలో ఉద్యోగానికి లోగడే దరఖాస్తు చేసాడని తెలుసుకొని నిస్తుపోతుంది సంధ్య. విజయ్ స్నేహితుడు రవితో నిర్మలకు పరిచయమౌతుంది. విజయ్‌కి ఎయిర్‌ఫోర్స్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళి తిరిగివచ్చిన తరువాత, జాబ్ వస్తే జేరటానికి సంధ్య తన సంతోషాన్ని వ్యక్తపరుస్తుంది. విజయ్, సంధ్యలు కూతురుకు రాధా అని పేరు పెట్టుకుంటారు. తను ప్రేమించిన మీనా ముఖం మశూచికంవల్ల వికృతంగా మారటంతో సునీల్ సంధ్య సలహా తీసుకుంటాడు. 'ఆమ్‌స్టర్ డామ్' నగరంలో ట్రైనింగ్‌కు వెళ్ళిన విజయ్‌కి, రీనాతో ఆమె ప్రియుడు రాల్ఫ్‌తో పరిచయమవుతుంది. 'జిమ్' అనే యువకుని ప్రేమించి మోసపోయి వేశ్యా వృత్తిలో చేరిన 'సిల్వియా'ని విజయ్ ఆకర్షిస్తాడు. రవి, నిర్మలకు సుధ పుట్టిన తర్వాత, భారత్, పాకిస్థాన్‌ల మధ్య జరుగుతున్న యుద్ధంలో విజయ్ పాల్గొంటాడు. సర్దార్‌జీ 'రతన్‌సింగ్'తో స్నేహమేర్పడుతుంది విజయ్‌కి.

[illegible] ఈ చిన్న [illegible] ప్రతిఒక్కరు.

ఆ ఉదయం — రవి ఎవరితోనో మాట్లాడుతున్నాడు. సంధ్య లిస్ట్ చూసి, ఆరోజుకి రిలీఫ్‌గా ఫీలయింది. రవి కోసం ఎదురుచూస్తూ ఆలోచనల్లో పడింది ... ఇక్కడున్నవాళ్ళంతా తనలాగే ఆత్మీయులకోసం ఎంత తహతహలాడుతున్నారు !? మనుష్యుల మధ్య నున్న ఈ అనుబంధాలే వాళ్ళను జంతువులకంటె ఓ మెట్టు పైన వుంచుతున్నాయి. తల్లి — బిడ్డ; భార్య — భర్త, చెల్లి — అన్న; ఇటువంటి బంధాలు ఒక కుటుంబంలోని వ్యక్తుల మధ్య నున్నట్లే, విశ్వమంతా ఒకటే కుటుంబంగా మారి — ప్రతి వ్యక్తి తోటి వ్యక్తిని రక్త సంబంధీకుడుగా చూడటం జరిగితే—? అప్పుడు భూతలమే స్వర్గంగా మారిపోదూ ? విమానాలు వచ్చాయి. దేశానికీ, దేశానికీ మధ్య నున్న దూరాలు తగ్గిపోయాయి. మనిషికీ, మనిషికీ వున్న దూరాలు తగ్గేదెన్నడో ?

ప్రతి జీవికీ స్వార్థం పుట్టుకతో వస్తుంది. ఆ స్వార్థమే లేకపోతే మనుగడేలేదు. కాని ఆ స్వార్థంతోపాటు పరార్థం కూడా వుండాలని చెప్పే అంతరాత్మ మనలో వుంది. స్వార్థం పెరిగినకొద్దీ మనోపరిధి తగ్గుతూవుంటుంది. స్వార్థం తగ్గినకొద్దీ తృప్తి హెచ్చుతుంది ... కాని పుట్టుకతో వచ్చిన స్వార్థాన్ని విడనాడలేని మానవుడు — ఆలోచనా శక్తి, విచక్షణా జ్ఞానం వున్నా — యుద్ధాలు మానలేకపోతున్నాడు; హింసాకాండ ఈ ప్రపంచంలో ఇంకా అంతం కాలేదు.

ఆలోచిస్తూ పరధ్యానంగా వున్న సంధ్యను పిలిచాడు రవి.

''సంధ్యా! ఇది విన్నావా ?''

నిరాసక్తిగా చూసింది సంధ్య.

''యుద్ధం ముగిసింది సంధ్యా! బంగ్లాదేశ్‌లో పాక్ సైన్యం మనకు లొంగిపోయింది. ఇప్పుడే అందిన వార్త! యుద్ధం ముగిసింది!'' సంతోషంగా చెప్పాడు.

అంతులేని ఆనందంతో పరవళ్ళుతొక్కింది ఆమె హృదయం

ఉద్వేగంతో కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆప్యాయంగా ఆమె చేతిని నొక్కాడు రవి. ''ఇంటికి వెళ్దామా ? నిర్మలకి చెప్పద్దూ ఈ శుభవార్త ?'' అన్నాడు.

ఇద్దరూ టాక్సీలో ఇల్లు చేరారు. నిర్మలను చూస్తూనే వాటేసుకుంది సంధ్య. ''అక్కా! అక్కా! యుద్ధం అయిపోయింది! నా విజయ్‌కి ఏమీ కాకుండానే యుద్ధం అయిపోయింది!'' అంటుంటే కన్నీళ్ళు జలజలా రాలాయి.

''మనం అదృష్టవంతులం'' అంది నిర్మల.

రాధను ఎత్తుకొని ''లక్కీ గర్ల్'' అంటూ ఆపకుండా ముద్దులు పెట్టేసుకుంది సంధ్య.

రవి అంతలోనే స్వీట్స్ తెచ్చాడు. అందరికీ చాలా హుషారుగా వుంది. వాతావరణంలో ఆనందం చిందులుతొక్కుతున్నది.

తలుపు తట్టిన చప్పుడయింది.

ఈ శుభసందర్భంలో ఎవరికయినా సరే స్వాగతం లభిస్తుంది !'' అన్నాడు రవి నవ్వుతూ.

నిర్మల వెళ్ళి తలుపు తీసింది. టెలిగ్రాం చేతిలో పెట్టాడతను. సంతకంపెట్టి, విప్పి చదివింది. చేతిలో ఆ గులాబీరంగు కాగితం రెపరెపలాడుతుంటే స్థాణువువలె వుండిపోయింది.

రాధను దింపి అక్క చేతిలోని కాగితం చదివింది సంధ్య.

''విజయ్‌కుమార్‌కి బలంగా గాయాలు తగిలాయి. వీలున్నంత త్వరలో ఢిల్లీ చేరుస్తాం.''

కళ్ళ ముందు చీకట్లు క్రమ్మాయి. కాళ్ళలో నిలబడే శక్తి హరించుకుపోయింది. కుప్పగా కూలిపోయింది

రవికి, సంధ్యకి కంగారుగా వుంది. విజయ్ ఎలా వున్నాడో ? సంధ్యకి ఏమవుతుందో ?

రాధ, సుధ ఏమీ అర్థంకాక బావురుమని ఏడవసాగారు.

నిమిషాలమీద సంధ్యని హాస్పిటల్‌లో చేర్చారు.

అబార్షన్ అయింది.

ప్రాణభయం లేదని చెప్పారు డాక్టర్లు.

రాత్రికి స్పృహ వచ్చింది. కడుపులో ఒకటే పోట్లు. ''అమ్మా'' అని మూలిగింది.

జరిగిన సంఘటనలు గుర్తు వచ్చాయి. యుద్ధం అయిపోయిందని సంబరంగా తామంతా స్వీట్స్ తింటుంటే, టెలిగ్రాం రావటం — ఆ కాగితంలోని అక్షరాలు కళ్ళముందు మెదిలినట్లయింది.

''సంధ్యా, లేచావామ్మా ?'' రవి స్వరం మృదువుగా వినవచ్చింది.

''విజయ్...?'' అస్పష్టంగా అడిగింది.

''ఇంకా ఏమీ న్యూస్ రాలేదు. గాయాలు తగిలాయని రాశారు టెలిగ్రాంలో, అంతే. నీ భయమే నిజమయివుంటే ఈపాటికి మరొక టెలిగ్రాం వచ్చేదే! నిశ్చింతగా వుండు సంధ్యా. బాధపడి, భయపడి చేయగలిగేదేమీలేదు.'' పైకి



సంధ్యకు ధైర్యం చెప్తున్నాడేకాని, లోలోన అతనికి భయంగానే వుంది.

సంధ్య ఏమీ మాట్లాడలేదు. కన్నీళ్ళు ఎంపుకుంది దిగులుగా.

మర్నాడు సంధ్యని ఇంటికి పంపించారు. క్షతగాత్రులతో ఆస్పత్రులు అన్నీ నిండివున్నాయి. అందువలన మామూలువాళ్ళని వీలున్నంతగా ఆస్పత్రులలో వుంచటంలేదు.

ఆ మధ్యాహ్నం సంధ్య తల్లిదండ్రులు, విజయ్ తల్లిదండ్రులు, తోబుట్టువులు వచ్చారు. నిర్మల, రవి శలవులుపెట్టేసి ఇంట్లోనే వున్నారు. అందరికీ ఒకే భయం.

విజయ్—? అతను బ్రతికివున్నాడా ?

విజయ్‌కి ఏదయినా అయితే సంధ్య తట్టుకో గలదా ?

తర్వాతరోజు విజయ్‌ని ఢిల్లీకి తీసుకువచ్చారు. కబురు తెలియగానే అందరూ హాస్పిటల్‌కి వెళ్ళారు. విజయ్ చాలా సీరియస్‌గా వున్నాడని, తన వాళ్ళను చూడాలని మరీ మరీ అడగటంతో ఎంతో కష్టపడి ఢిల్లీ తీసుకువచ్చామని చెప్పారు అక్కడివాళ్ళు.

''విజిటర్స్ వచ్చారు, చూడండి.'' విజయ్ చెవిలో చెప్పింది నర్స్.

చిన్నగా కళ్ళు తెరిచాడు. రెప్పలు తెరవటానికి, ఆర్పటానికి కూడా ఎంతో ప్రయాసగా వుంది అతనికి.

మంచం చుట్టూ చాలామంది ఉన్నారు. అంతా తనకు ఆత్మీయులే. ఒక్కొక్కరిని చూస్తుంటే, నీరసించిన అతని మనసులో ఒక్కో సంఘటన మెదులుతున్నది.

కథలు చెప్తూ గోరుముద్దలు తినిపించి పెంచిన అనురాగమయి అమ్మ —

తను కోరినవన్నీ ఇస్తూ, చదువు చెప్పించి పెద్దజేసి, పెద్దవాడయితే చూసి గర్వించిన నాన్న—

చిన్నప్పుడు చేయి పట్టుకొని బడికి తీసుకు వెళ్ళిన అక్క —

తోటి పిల్లలు ఎవరయినా కొడితే తనవద్దకు వచ్చి కంప్లెయింట్ చేసే తమ్ముడు —

స్నేహంలోని తీయదనాన్ని చవిచూపించిన మిత్రుడు రవి —

ఇంకా నిర్మల, అత్తమామలు అందరూ కనిపిస్తున్నారు.

సంధ్య...సంధ్య... తన ప్రాణంలో ప్రాణం... అంతులేని మాధుర్యాన్ని పంచి యిచ్చిన సంధ్య... ఏదీ ? భార్య కోసం వెతుకుతున్నాయి అతని కళ్ళు...

అతి ప్రయత్నంమీద తల ప్రక్కకి త్రిప్పాడు.

పూల చీరలో సంధ్య... చేతిలో చిట్టితల్లి రాధ...

చిన్నగా నవ్వబోయాడు.

ఇక నిలబడలేనట్లు సంధ్య మంచం ప్రక్కనే నేలమీద మోకాళ్ళపైన కూర్చుంది. దుప్పటి కొద్దిగా జరిపి అతని చల్లని చేయిపైన వణుకుతున్న తన చేతిని ఉంచింది.

## ఇది ఒక పాంధశాల

ఏడుపు ఆపుకోవటానికి ఆమె విశ్వప్రయత్నం చేస్తున్నది.

విజయ్‌కి కూడా ఏడుపు వచ్చింది. అందరినీ వదలేసి వెళ్ళిపోతున్నాడు తను... ఎక్కడికో... ?

చిన్నప్పుడు చదువుకున్నాడు తను ఓ సుభాషితం. మనసు అడుగుపొరల్లో ఎక్కడో 'సబ్‌కాన్షస్'లో దాగి ఉన్న ఓ లైను బయటకు రావటానికి ప్రయత్నిస్తున్నది ఎందుకో. గుర్తు వచ్చింది అంతలోనే —

''ఇది ఒక పాంధశాల...'' అన్నాడు చిన్నగా. ఆపైన శక్తి చాలలేదు.

''గుడ్‌బై'' అన్నట్లు చేయి కొంచెం పైకి ఎత్తాడు.

అనురాగం నింపుకున్న కళ్ళతో అందరినీ చూశాడు మరోసారి. లీలగా చిరునవ్వు కదలాడింది పెదవులపైన.

అతని ప్రమేయం లేకుండానే కళ్ళు మూసుకు పోయాయి.

* * *

తల్లిదండ్రులు సంధ్యని హైదరాబాదు తీసుకువెళ్ళారు.

సంధ్యకి బ్రతుకంతా చీకటిగా కనిపిస్తున్నది. విజయ్ వెళ్ళిపోయాడు !



ఎక్కడికి ? తెలియదు.

ఎందుకు ? తెలియదు.

తను వెళ్ళకుండా ఇక్కడే వున్నదేమిటి ? ఏమో ! ఎప్పుడు వెళ్తుంది ? ఏమో, తనకు ఎప్పుడు పిలుపు వస్తుందో !

పిలుపు వచ్చి వెళ్ళిననాడు మరో లోకంలో విజయ్‌ని కలుసుకుంటుందా ? అసలు మరో లోకం వుందా ?

లేక విజయ్ మరో జన్మ ఎత్తితే, తను కూడా మళ్ళీ పుట్టి విజయ్‌ని కలుసుకుంటుందా ?

దేనికీ సమాధానం తెలియదు.

తెలిసినదల్లా ఒక్కటే — విజయ్ లేకుండా బ్రతుకు చీకటి.

అతను లేని విశ్వం శూన్యం.

అటువంటి జీవితం అనుభవించకపోతేనేమిటి ?

కాని అమ్మ, నాన్న, అత్తయ్య, మామయ్య— అందరినీమించి చిన్నారి రాధ — ఈ బంధాలు తెంచుకుంటే మాత్రం తెగేనా ?

త్రెంచుకొని వెళ్ళిపోయి వాళ్ళను దుఃఖంలో ముంచేయటం న్యాయమా ?

అయినా ఆత్మహత్య చేసుకున్నదంటే దుఃఖాన్ని భరించలేని బలహీనురాలయితే విజయ్‌కి తను తగిన భార్య కాదు. తన విజయ్ స్మృతుల కోసం తను బ్రతకాలి.

విజయ్ సాహచర్యంలో తను ఎంతో ఎదిగింది. సుఖదుఃఖాలను ఒకటిగా చూడాలనేవాడు అతను.

అది మహామహులకే కష్టసాధ్యం.

అతనికీ సాధ్యమయిందనికాదు. సాధన మాత్రం అతనిది.

ఆ సాధన చేయవలసిన బాధ్యత తనకు మాత్రం లేదూ ?

'ఎటాచ్‌మెంట్ విత్ డిటాచ్‌మెంట్' — 'అనురక్తిలోనే విరక్తి' — బ్రతుకంటే ప్రేమ; చావంటే నిర్లక్ష్యం — ఇటువంటి వ్యతిరేక భావాల్ని పెంచుకోమంటాయి వేదాంత గ్రంథాలు.

'పడవెళ్ళిపోతుందిరా...
సాధన చేయుమురా నరుడా,
సాధ్యము కానిది లేదురా!'

రేడియోలో పాట వినవచ్చింది.

విజయ్ వేదాంత గ్రంథాలు ఎన్ని చదివాడనీ ! చేసే ప్రతి పనిలోనూ, చెప్పే ప్రతి మాటలోనూ విజ్ఞానం తొంగిచూసేది. ఇంత త్వరగా ఆరిపోయిందే ఆ దీపం. 30 ఏళ్ళ ఆయువు కూడా ఇవ్వలేదేం దేవుడు ?

అసలున్నాడా దేవుడు ? వుంటే తనను చల్లగా చూడలేదేం ? పసిపిల్ల రాధకు తండ్రి లేకుండా ఎలా చేయగలిగాడు ?

పరమాత్ముని మనసులో ఏముందో ఆయనకే తెలుసు. తన కెలా తెలుస్తుంది ? అసలు ఆయనకు మనసనేది వుందా ? లేక, ఇదంతా ఏదో తికమక — అంతేనా ?

ఆలోచనలు ! ఆలోచనలు !! ఆలోచనలు !!

చెల్లెలిని చూడటానికి వచ్చిన నిర్మల, ఆ పిల్ల వాలకానికి భయపడి తనతో తీసుకు వెళ్ళింది. రవికి బెనారస్ ట్రాన్స్‌ఫర్ అయింది. వాళ్ళిప్పుడు అక్కడే వుంటున్నారు. నిర్మల ఇంట్లోనే వుంది. ఏ ఉద్యోగంలోనూ చేరకుండా, వివిధ మాగ్‌జైన్స్‌లో ఏవేవో శీర్షికలు నిర్వహిస్తున్నది.

బాధలు, భయాలు, సుఖాలు వీటితో నిమిత్తంలేకుండా సూర్యోదయం,సూర్యాస్తమయం అవుతూనేవున్నాయి. కాలచక్రం తిరుగుతూనే వుంది.

మనసులోని వ్యథ కించిత్తయినా తగ్గకపోయినా, పైకి మామూలుగా వుండడం అలవాటు చేసుకుంది సంధ్య. పాత మిత్రులు సునీల్, మీనా కూడా ఆ ఊర్లోనే వుంటున్నారు. అంతా కలిసి సినిమా ప్రోగ్రామ్స్ మొదలైనవి వేస్తూ నిత్యం సంధ్యని డైవర్ట్ చేయటానికి ప్రయత్నిస్తున్నారు.

అకస్మాత్తుగా ఓనాడు వచ్చాడు అరుణ్ ఆరోరా. అతన్ని చూస్తూనే సంధ్యకి సంతోషం, దుఃఖం కూడా కలిగాయి. విజయ్ మిత్రుడిని చూస్తున్నానని సంతోషం, విజయ్‌ని తలచుకొని దుఃఖం. చిక్కిపోయిన సంధ్యని చూసి ఆమె ఆవేదన అర్థంచేసుకున్నాడు అరుణ్.

''మీరు ఉద్యోగం చేయాలి సంధ్యా ! డబ్బు

కోసం కాదు... మనసుని ఆలోచనలనించి తప్పించటానికి'' అన్నాడు

''మా అక్కావాళ్ళు కూడా అదే అంటున్నారు. కాని నాకేం ఆసక్తి, ఉత్సాహం లేవు'' అంది సంధ్య.

''మీకు జీవితంలో ఆసక్తి, ఉత్సాహం లేకుండా వున్నాయి కనకనే ఉద్యోగంలో చేరమంటున్నాను చేతినిండా పని వుండటానికి మించి టానిక్ మనసుకి మరొకటిలేదు!

ఉండండి, నేను చూసిపెడ్తానుగా మీకు, జాబ్'' అన్నాడు

అతనికి నెల పైగా ఆ ఊరిలో పని వుంది ప్రతి సాయంత్రం వచ్చేవాడు సంధ్య దగ్గరకు ఏవేవో కబుర్లతో అందరినీ హుషారుగా వుంచేవాడు

ఓరోజు నిర్మల, రవి మాత్రమే వున్నప్పుడు చెప్పాడు ''సంధ్యని చూసిన మొదటిరోజునించి ఆమెను అభిమానిస్తున్నాను దుఃఖాన్ని పోగొట్టుకోవటాన్ని చేయటానికి తహతహలాడుతున్నాను. సంధ్య సుఖాన్ని మించి నాకు కావలసిందేమీలేదు! సంధ్యని పెళ్ళి చేసుకుంటున్నాను రాధని కన్నబిడ్డలా చూసుకుంటాను''

అతని స్వరంలో సంధ్య ఎడ్ల అమరాగం తొణికిసలాడుతున్నది

''నా చెల్లెలి జీవితంలో తిరిగి వెలుగు రావటంకంటే నాకేం కావాలి, అరుణ్!'' అంది నిర్మల

''పెళ్ళికి ఒప్పుకోకపోయినా సంధ్య నన్ను ఆప్తమిత్రుడిగా భావించాలి! నేనే అడిగితే అపార్థం చేసుకుంటుందేమోనని భయంగా ఉంది''

''వీలుచేసుకొని మేము సంధ్యని అడుగుతాము'' అన్నాడు రవి

కొద్ది రోజులకు పెళ్ళి ప్రసక్తి ఎత్తింది నిర్మల

''విజయ్‌ని చూసిన దృష్టితో మరెవరినీ చూడలేనక్కా ప్లీజ్ అర్థం చేసుకో'' అంది సంధ్య

''విధివశాత్తూ కట్టుకున్న ఇల్లు కూలిపోయిందనుకో సంధ్యా! ఆ శిథిలాలు చూసి ఏడుస్తూ కూర్చుంటావా? లేక తిరిగి కట్టుకోవటానికి ప్రయత్నిస్తావా?''

ఆ వాదనకు జవాబు చెప్పలేకపోయింది సంధ్య

''అవుననీ, కాదనీ ఇప్పుడే చెప్పవలసిన అవసరంలేదు సంధ్యా నింపాదిగా ఆలోచించుకొనే చెప్పు'' అన్నాడు రవి

రెండు, మూడు నెలలు ఈ విషయం ఆలోచించినా, మొదట ఇచ్చిన జవాబు తప్ప మరొకటి యివ్వలేకపోయింది సంధ్య

ఆమెకు దిగులు రోజురోజుకీ హెచ్చుతున్నదే కాని తగ్గటంలేదు / విజయ్! నన్ను వదిలి ఇంత నిర్దాక్షిణ్యంగా ఎలా వెళ్ళిపోయావు? నేనేమయిపోతాననుకున్నావు?—'' అని పదేపదే ప్రశ్నించేది విజయ్‌ని మనసులో తన ఆత్మీయుల కోసం, తన బంగారు పాప రాధ కోసం, సంతోషంగా కనిపించాలని ప్రయత్నించినా అది నటనే అయేది ఏం చేస్తే మండుతున్న మనసు చల్లబడుతుందో, ఎండిపోయిన జీవితం చిగురుస్తుందో ఆమెకే తెలిసేది కాదు పుస్తకాలు చదివినా, స్నేహితులతో కాలం గడిపినా, పాప పనులు చూసినా, దైవ ప్రార్థన చేసినా — దేనిమీదా మనసు నిలిచేదికాదు స్ప్రింగ్‌ని నొక్కిపడితే ఏమవుతుంది? చేయి తీయగానే మరింత విజృంభిస్తుంది. అలాగే మనసు మరింతగా విజయ్ జ్ఞాపకాలవైపు వెళ్ళేది

*  *  *

సుదీర్ఘమైన గతం పునరావృతం చేసుకుంటూ, రాత్రంతా నిద్రలేకుండా గడిపింది సంధ్య తెల్లవారుఝామున కలత నిద్రలోకి జారింది

మెలకువ వస్తూనే అరుణ్ ఆరోరా ఉత్తరం గుర్తొచ్చింది తనకు ఫారిన్‌లో ఉద్యోగం సంపాదించాడు అతను వెళ్ళమనే అంటోంది మనసు

కాలకృత్యాలు తీర్చుకున్నాక గుడికి బయల్దేరింది సంధ్య ఈమధ్య ప్రతిదినం చేస్తున్న పని ఇది గుడికి వెళ్తే దైవ ప్రార్థనలో మనసు లగ్నంచేస్తే, ఏమయినా ఊరట చిక్కుతుందేమోనని ఆశ.

విదేశాలకు వెళ్తే స్థలం మార్పు, వాతావరణం మార్పు వలన ఏదయినా కొంత మనశ్శాంతి లభిస్తుందేమో! లేక మరింత ఒంటరిగా ఫీలవుతుందా? ఏమో!



కాని ఎందుకో అనిపించింది — తన విజయ్ మరణించిన భూమి ఇది ఇక్కడే అతను బూడిద అయాడు. ఈ దేశంకోసమే ప్రాణం అర్పించాడు

ఇక్కడినించి పారిపోతేమాత్రం తనకు శాంతి లభిస్తుందా? తన మనసు, ఆలోచనలు, వ్యథలు తన వెంటే వుంటాయికదా? వాటినించి పారిపోగలదా?!

జన్మభూమి కోసం ప్రాణత్యాగం చేసిన అమరమూర్తి విజయ్ అతని బిడ్డను మరో గడ్డపైన పెంచటం ఏం న్యాయం?

'విజయ్! నేను ఈ దేశంలోనే వుంటాను కొంగుకి మూటకట్టివున్న ఈ నిప్పుని ఇలా భరిస్తూనే వుంటాను నీ బిడ్డను నీవు గర్వించేటట్లుగా తీర్చిదిద్దుతాను' మనసు గట్టిచేసుకుంది సంధ్య

త్రోవలో ఓ బిల్డింగ్ ముందు ఏదో హడావిడిగా వుంది

ఒక పండితుడిని ఎవరో అడుగుతున్నారు 'ఏమిటి హడావిడి' అని

''క్రొత్తగా 'పాంథశల' ప్రారంభిస్తున్నారు ఇక్కడ'' సంస్కృతపదాలు ఉపయోగిస్తూ చెప్పాడాయన

''అంటే ఏమిటి, బాబూ?''

''సత్రమయ్యా, సత్రం! యాత్రికుల కోసం'' హిందీలో చెప్పాడాయన

సంధ్య మనసులో మెరుపు మెరిసింది విజయ్ ఆఖరు క్షణాల్లో ఏమన్నాడు?

''ఇది ఒక పాంథశాల.''

తన కెందుకో విజయ్ మరణించిన దృశ్యం తలచుకోవటం ఇష్టంలేక ఎప్పుడూ ఆ స్మృతుల నుంచి మనసును మధురస్మృతులవైపు మళ్ళించేది. అందుకే అతని చివరి మాటలు మనసులో మరుగునపడినాయి

''ఇది ఒక పాంథశాల.''

మానవుని అనంతయాత్రలో ఈ విశ్వాన్నే ఒక పాంథశాలగా పేర్కొన్నాడు ఒక కవి ఎక్కడినించో వస్తున్నాం. మరెక్కడికో పోతున్నాం... మధ్యలో సత్రంలో కొద్దిరోజులు ఆగుతాం. అంతకుమించి ఈ మజిలీకి ప్రాముఖ్యం ఏమీలేదు ఇక్కడ వున్నది ఏదీ పూర్తిగా ఎవరికీ చెందదు అన్నీ అందరివీ! ముందో, వెనకో అంతా వెళ్ళిపోయేవాళ్ళమే ఈ నాలుగురోజుల భాగ్యానికి ఎందుకీ బంధాలు, ఆశలు, రోషాలు, ద్వేషాలు? చిరునవ్వుతో మంచిగా బ్రతికేయటం మేలు కదూ!

నారదమహర్షిని ''భూలోకంలోకల్లా నీవు చూసిన వింత ఏమిటి?'' అని అడిగితే ''ముందు వెళ్ళిపోయినవారికోసం వెనకనున్నవారు ఏడవటం విచిత్రంగా తోచింది!'' అన్నాడుట

సత్రంలో వున్నపుడు అద్దె చెల్లించవద్దూ? ఆ అద్దె మంచితనం' చుట్టూ వున్న నలుగురి మంచికోసం తాపత్రయపడేవాడిదే సార్థకమైన జీవితం

''ఇది ఒక పాంథశాల..''

పదే పదే విజయ్ స్వరం చెవుల్లో మ్రోగుతున్నది సంధ్యకి

'విజయ్! ఇలా దుఃఖంలో కుమిలిపోవటం స్వార్థమని గ్రహించాను నా మనసుని అర్థంచేసుకున్నవాడివి కనకనే వెళ్ళిపోయేటపుడు నాకు ఈ సందేశం ఇచ్చావు ఇన్నాళ్ళూ నేనే గుర్తించలేదు!'

'ఇతరుల కన్నీటిని తుడవటానికి నా జీవితం వినియోగిస్తాను అప్పుడు నా కన్నీరూ బయటకు పొంగదు' ఎప్పుడో విజయ్ చెప్పిన 'కిసాగోతమి' కథ మదిలో మెదిలింది

'విజయ్! నీ స్మృతులు నా మనసులో దివ్వెవౌగా, చుట్టూ వెలుగు విరజిమ్మటానికి ప్రయత్నిస్తాను'

గుడి సమీపించింది

లోనించి భజన వినవస్తున్నది

''నళినీ దళ గత జలమతి తరళం
తద్వజ్జీవిత మతిశయ చపలం''

(తామర పూరేకుపైన నిలిచి ఉన్న నీటి బొట్టుకి ఎంత స్థిరత్వం ఉంది? జీవితానికి కూడా అంతే స్థిరత్వం ఉంది!)

దేవాలయం వైపు వడివడిగా అడుగులు వేయసాగింది సంధ్య

*(అయిపోయింది)*

# అన్నాచెల్లెలు

అదొక అడవి. ఆ అడవిలో ఒక కట్టెలు కొట్టేవాడు, వాడి భార్య యిద్దరు పిల్లలతో వుండేవాడు. పిల్లలంటే, ఒక అబ్బాయి ఒక అమ్మాయి. వీరంతా చాలాకాలం సుఖంగా జీవించారు. కానీ కొన్నాళ్ళకు కట్టెలు కొట్టేవాడి భార్య చనిపోయింది. పిల్లలు చాలా చిన్నవాళ్ళు. వాళ్ళను చూడడంకోసమని, మరొకతెను పెళ్లి చేసుకున్నాడు. తర్వాత రోజులు గడుస్తున్నకొద్దీ వాళ్ళకు కష్టాలు ప్రారంభమయ్యాయి. కట్టెలు కొట్టి అమ్మగా వచ్చిన డబ్బుతో పూట గడవడం కష్టమయిపోయింది. చాలాసార్లు పస్తులుకూడా వున్నారు.

అటువంటి సమయంలో అతడి భార్యకు ఒక ఆలోచన వచ్చింది. అతడితో యిలా చెప్పింది. 'ఈ ఇద్దరు పిల్లల్ని ఎక్కడైనా వదిలేయరాదా, వాళ్ళకి పెట్టే తిండి మనకు మిగులుతుందికదా!' అతడికి తన రెండవ భార్య ఆలోచన వినగానే మతిపోయినంత పని అయ్యింది

'వాళ్ళు నీకు పుట్టిన పిల్లలు కాదు గాబట్టి వాళ్లను వదిలేయమంటావా? వాళ్లను ఏ జంతువులైనా తినేస్తే నీకు హాయిగా వుంటుందనుకుంటాను!' అన్నాడు కోపంగా.

'వాళ్లను కడుపు మాడ్చి చంపడంకంటే ఆదే నయం' అంది. ఇద్దరూ చాలాసేపు వాదించుకున్నారు. చివరకు భార్య చెప్పినట్టు పిల్లలను దట్టమైన అడవిలో వదిలేసి రావడానికి నిశ్చయించుకున్నాడు.

తల్లిదండ్రుల మాటలన్నీ ప్రక్క గదిలో వున్న అన్నా చెల్లెలు విన్నారు. చెల్లెలు ఏడవడం మొదలుపెట్టింది. అన్న మాత్రం 'పూర్కో, నేను ఒక ఉపాయం చెపుతాగదా!' అన్నాడు.

తల్లిదండ్రులు నిద్రపోయిన తర్వాత అన్నయ్య మెల్లగా పక్కమీదనుంచి లేచి ఇంటి బయటకు వచ్చాడు. ఇంటిముందర తెల్లగా మెరుస్తున్న రాళ్లను తన లాగు జేబులనిండా పోసుకుని ఇంట్లోకి వచ్చి పడుకున్నాడు. 'ఇదంతా ఏమిటి?' అడిగింది చెల్లెలు. 'తర్వాత నీకు తెలుస్తుంది కదా!' అన్నాడు.

మరునటి రోజు ఉదయం భార్యా భర్తలు పిల్లలను తీసుకొని బాగా దట్టంగా వున్న అడవివేపు ప్రయాణం సాగించారు. అలా చాలా దూరం పోయాక ఒకచోట ఆగారు. అన్నయ్య అందరికంటే వెనకగా నడుస్తూ, తన జేబుల్లోని రాళ్లను ఒక్కొక్కటి జారవిడుస్తూ వెళ్లాడు.

'మీ ఇద్దరూ ఇక్కడే వుండండి. మేం ఇటు వెళ్లి కట్టెలు కొట్టుకొని వస్తాం' అంది సవతితల్లి పిల్లలతో. తండ్రి, సవతితల్లి వెళ్లిపోయారు. పిల్లలు ఇద్దరికీ తెలుసు, వాళ్ళు తిరిగి రారని.

వాళ్ళు నిజంగానే తిరిగి రాలేదు. బాగా



చీకటి పడింది. చెల్లెకు భయమేసింది. 'నేను వున్నాకదా, భయపడకు' అన్నాడు అన్నయ్య. చంద్రుడు ఆకాశంలో బాగా పైకి వచ్చాడు. ఆ వెన్నెలలో అన్నీ బాగా కనిపిస్తున్నాయి. అన్నయ్య తను దారిలో జారవిడిచిన రాళ్లను వెన్నెల్లో బాగా మెరుస్తుండగా చూసాడు. 'ఇదిగో, ఈ రాళ్లు మన ఇంటికి దారి చూపిస్తాయి' అన్నాడు. ఇద్దరూ ఆ రాళ్ల గుర్తుతో ఇంటికి ఏటువంటి కష్టం లేకుండా చేరుకున్నారు.

సవతితల్లి వీళ్లను చూడగానే ఎంతో ప్రేమ నటించింది. 'అయ్యో, మీరు ఎటు వెళ్లిపోయారు ? మీకోసం వెతికి వెతికి ఇంటికి వచ్చాం, మీకోసం ఎంత బాధ పడ్డామో తెలుసా' అంది. పిల్లలు విని వూరుకున్నారు.

మరునటి రోజు పిల్లలు నిద్రపోయిన తర్వాత మళ్ళీ భర్తతో ఇలా చెప్పింది. 'వాళ్ళు తిరిగి వచ్చేశారు చూసావా ! ఈసారి వాళ్లను ఇంకా దూరంగా తీసుకెళ్ళి వదిలేద్దాం' అంది.

తెల్లవారిన తర్వాత తల్లిదండ్రులు పిల్లలను మళ్ళీ అడవికి బయలుదేరమన్నారు అన్నయ్యకు విషయం తెలిసిపోయింది. వెంటనే ఇంట్లోకి వెళ్లి రొట్టెల పిండిని జేబుల్లో నింపుకుని బయలుదేరాడు. భార్యా భర్తలు ఈసారి మరింత దూరంగా, దట్టంగావున్న అడవిలోకి తీసుకెళ్లారు. అన్నయ్య మునుపటిలాగే వాళ్ల వెనక నడుస్తూ దారిలో రొట్టెల పిండిని జారవిడుస్తూ వెళ్లాడు.

'ఇప్పుడే వస్తాం, ఇక్కడే వుండండి' అంటూ తల్లి తండ్రి వెళ్లిపోయారు. వాళ్లు తిరిగి రాలేదు. బాగా చీకటిపడింది. కొంతసేపటికి చంద్రుడు ఆకాశంలోకి వచ్చాడు. వెన్నెల ఎక్కువయింది.

అన్నయ్య చెల్లెలు చేయి పుచ్చుకుని బయలుదేరాడు. కానీ అతనికి దారి తెలియలేదు. రొట్టెల పిండి కనిపించలేదు. కొన్నిచోట్ల వాటిని చీమలు తినేశాయి. కొన్నిచోట్ల నేలమీది తేమవల్ల కనపడలేదు. అన్నయ్యకు భయమేసింది. ఇంటికి దారి కనుక్కోవడం కష్టమని తెలిసిపోయింది. అసలే అది చాలా దట్టమైన అడవి. అప్పుడప్పుడూ జంతువుల అరుపులు వినిపిస్తున్నాయి. ప్రతి క్షణం భయపడుతూ అడవిలో చాలా దూరం అటూ ఇటూ తిరిగారు.

ఒక చెట్టు కొమ్మమీద ఒక అందమైన పక్షి కనిపించింది. దాని రెక్కలు అతి తెల్లగా వున్నాయి. ఆ పక్షి వీళ్లను చూడగానే ఆకాశంలోకి ఎగురుకుంటూ వెళ్లింది. పిల్లలు వెన్నెల వెలుగులో దానిని చూస్తూ పరుగెత్తారు.

ఆ పక్షి అలా వెళ్లి వెళ్లి ఒక ఇంటిమీద ఆగింది. అంత దట్టమైన అడవిలో అదొక్కటే ఇల్లు. పిల్లలు అక్కడకు



చేరుకున్నారు. అక్కడ అనేక తినుబండారాలు పెట్టివున్నాయి. వాటిని చూడగానే అన్నా చెల్లెలకు సంతోషమేసింది. గబగబా వాటి దగ్గరకు పరుగెత్తారు. అదే సమయంలో ఒక ముసలిది ఇంట్లోంచి బయటకు వచ్చింది.

'రండర్రా పిల్లలూ ! మీకు కావలసినంత తిందురుగాని' అంటూ పిలిచింది. వాళ్లను లోపలకు తీసుకెళ్లింది. వాళ్లను కూర్చోబెట్టి రకరకాల వంటకాలను వడ్డించింది. వాళ్ళు కడుపునిండా తిన్నారు. వాళ్ళు తింటుండగా ముసలిది గమనిస్తూనే వుంది. ఆ ముసలిది ఒక మంత్రగత్తె. అది ఈ పిల్లలను తినడానికి ఎత్తులు వేస్తోంది.

వున్నట్టుండి మంత్రగత్తె అన్న రెక్క పుచ్చుకొని బరబరా ఈడ్చుకెళ్లి ఒక బోనులో వేసి దాని తలుపువేసి తాళం పెట్టేసింది. 'నువ్వు ఇక్కడే వుండాలి. నీకు రోజూ తిండిపెట్టి బాగా బలిసేటట్టు చేస్తాను. అప్పుడు నిన్ను తింటే నాకు కడుపు నిండుతుంది' అని నవ్వింది.

అతడి చెల్లెలితో మంత్రగత్తె ఇలా చెప్పింది 'నీకు వంటకు కావలసినవన్నీ తెస్తాను. మీ అన్నయ్యకు మంచి మంచి వంటకాలు చేసిపెట్టు. వాడు బాగా లావు అవ్వాలి' చెల్లెలు అన్న కోసం ఎంతో ప్రాధేయపడింది. కానీ ముసలిది అతడ్ని వదిలేయడానికి ఒప్పుకోలేదు.

ప్రతిరోజూ చెల్లెలు బాగా వండిపెట్టగా, అన్నయ్య బోనులో వుండి హాయిగా భోంచేసేవాడు. ముసలిదానికి కళ్ళు సరిగా కనిపించవు. బోనులో వున్న అన్నయ్య బాగా లావు అయ్యాడో లేదో తెలుసుకుందామని బోను దగ్గరికి వెళ్లి 'ఏదీ నీ చూపుడువేలు

[ 34వ పేజీ చూడండి ]



'కళ్యాణి'లో స్నేహప్రభ, మోహన్‌బాబు, భావన

# సినిమా విశేషాలు — జి. వి. జి.

### "వేటగాడు"లో యువతుల వేట

తేయాకు తోటలో కొంతమంది అమ్మాయిలు పనిచేస్తూంటే, కందస్వామి [అల్లు రామలింగయ్య] ఠీవిగా వస్తూ, చేతిలోని అటెండెన్స్ రిజిస్టర్ చూసి, అందరి పేర్లూ చదువుతూంటే, అతని వెనుక ఒక కూలీ గొడుగు పట్టి నడుస్తున్నాడు...

"అన్నపూర్ణ అనంతమ్మా... సీతాల సాంబమ్మా... మంగ... కోర్య మహాలక్ష్మీ...

'వినాయక విజయం'లో సత్యనారాయణ, ప్రభ



తోటకూర సుబ్బా—" అంటూ ఓ చోట నిలబడి ఉన్న తిలకం [మమత]ను చూసి, అటుకేసి వెళ్లాడు కందస్వామి. "ఎవరీ బ్యూటీ? కొత్తగా చేరిందా?... ఏయ్, అమ్మాయ్, ఎవర్నడిగి ఈ పన్లో చేరావ్ నువ్వు?"

"చేరాక అడగొచ్చని చేరిపోయానబ్బా! పన్లేదంటే చెప్పు — పక్క తోటలోకి దూకుతా!"

"ఆఁ దూకొద్దు, దూకొద్దు, చూడ్డానికి చాలా అందంగా ఉన్నావ్. ఒళ్లు దాచుకోకుండా పని చేసుకుంటే, పైకొస్తావ్! చూడూ... నీ పేరు?"

"దీపా యెంకట అన్నపూర్ణ కనకమహాలక్ష్మీ దుర్గా తిలకం."

"అబ్బో — అంత పేరు చెప్పేసరికి సగం ఊపు చచ్చిపోతుందే — నిన్ను 'తిల్లూ' అని పిలుస్తాను... నీకు ముందూ వెనకా ఎవరన్నా ఉన్నారా?"

"ఓ అన్నున్నాడు. యెనకే ఉన్నాడు."

ఇంతలో 'గొడుగువాడు' చెప్పొద్దన్నట్టు చెయ్యి ఊపాడు. కందస్వామి వెనక్కి తిరిగి, "వెనక మా గొడుగు వెధవగాడున్నాడంతే," అన్నాడు.

"మాటవరసకన్నాను. నాకో అన్నున్నాడు."

"అలాగా? నిన్ను చూస్తూంటే, నాకో రకమైన ఆవేశం కలుగుతుంది. మన ఆవేశానికి మీ అన్నెమైనా అడ్డుమొస్తాడేమో! వస్తే, నేనూరుకుంటానేంటి? వాడి వీపు విమానంమోత మోగించేస్తాను," అంటున్న కందస్వామి వీపుమీద గొడుగువాడు కొట్టి, "ఇలా మోగిస్తారమ్మా" అన్నాడు. "ఏమిట్రా! నేను మోగించేదల్లా నువ్వు మోగించి చూపించాలా నాకు?" అని కందస్వామి అంటుండగా జీప్ హారన్ వినిపించింది. అదిరిపడ్డ కందస్వామి, తిలకంతో "తిల్లూ! పారిపోదామన్నాడు. నువ్వెళ్లి ఆ చెట్టుచాటున దాక్కో!" అన్నాడు. తిలకం వెళ్తూ, "ఎవరాయన?" అంది. "నా మొగుడు. నిన్ను చూస్తే వదిలిపెట్టడు. చాలా ప్రమాదకరమైన మనిషి. నువ్వే నాకున్న ఏకైక ఆస్తం. వెళ్లు... వెళ్లు... వెళ్లు!" అన్నాడు కందస్వామి. ఆ జీప్‌లో వచ్చిన వ్యక్తి హరి (సత్యనారాయణ).

— కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఎం. అర్జునరాజు, కె. శివరామరాజు నిర్మించిన "వేటగాడు" ఈస్ట్‌మన్ కలర్ చిత్రంలో ఎన్. టి. ఆర్., శ్రీదేవి నాయకా నాయికలు.

### తెలుగు నుంచి ఇతర భాషల్లోకి

"మన ఊరి పాండవులు": బాపు దర్శకత్వంలోనే సురేంద్రకపూర్ హిందీలో అమర్‌ఛాయా పతాకంలో నిర్మిస్తారు. సంజీవ్‌కుమార్, రణధీర్ కపూర్, డేనీ, రంజిత్, నీతా మెహతా, ప్రేంనారాయణ్, అమ్జద్‌ఖాన్ నటిస్తారు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీత దర్శకులు. డిసెంబర్‌లో షూటింగ్ ప్రారంభమౌతుంది.

"ఇదెక్కడి న్యాయం": హిందీలో "యే కైసా ఇన్సాఫ్" పేరున దాసరి నారాయణరావు దర్శకత్వంలోనే ఎల్. వి. ప్రసాద్ నిర్మిస్తారు. శబ్నాఅజ్మీ, వినోద్‌మెహ్రా నాయికా నాయకులు. రవీంద్రజైన్ సంగీత దర్శకుడు. ఆగస్టు 1న మద్రాసులో షూటింగ్ ప్రారంభమవుతుంది.

"తాయారమ్మ — బంగారయ్య": తమిళంలో డాక్టర్ బాలకృష్ణ సతీమణి సుశీలాదేవి నిర్మిస్తున్నారు. శివాజీగణేశన్, కె. ఆర్. విజయ, శ్రీప్రియ ప్రధాన నటవర్గం. విశ్వనాథన్ సంగీత దర్శకుడు. కొమ్మినేని శేషగిరిరావే ఈ చిత్రానికి దర్శకుడు.

'కుడిఎడమైతే'లో హాలం



# సినిమా

## ఒక తారకు మరో తార గాత్రం

"అందమైన అనుభవం" తమిళ వెర్షన్ "నినైత్తాలే ఇనిక్కుం" చిత్రంలో జయప్రదకు సంభాషణలు పలికినది మరో తెలుగు నటి సరిత.

సరిత కాఫీ, టీ పుచ్చుకోదు. పాలు మాత్రమే తాగుతుంది. అందుకే, ఈమెను బాలచందర్ యూనిట్‌లోని వారంతా 'బేబీ' అని పిలుస్తుంటారు.

## శ్రీదేవి గాభరా

"వేటగాడు" చిత్రం హైదరాబాద్‌లో షూటింగ్... అక్కడ ఓ గెస్ట్‌హౌస్‌లో శ్రీదేవికి, ఆమె తల్లికి బస ఏర్పాటు చేశారు రోజా మూవీస్‌వారు... ఒక రోజు ఆ గెస్ట్‌హౌస్ పక్కనే షూటింగ్ — పులి పాల్గొనే సన్నివేశం — ఆ పులి కాళ్ళను కట్టివేయబోతూండగా — అది హఠాత్తుగా ఆ ఇనుపగొలుసులను తెంచుకొని పారిపోయింది. శ్రీదేవి హడలిపోయి, పక్కనే ఓ కారు ఉంటే — తలుపు తెరిచి లోపలికి దూకింది. ఆ తర్వాత ఆమెకు తెలిసిందేమిటంటే — ఆ పులికి నోట్లో కొన్ని పళ్ళు లేవట. దానికి ఒక కన్ను కూడా లేదట.

"షాలిమార్" చిత్రంలో నటించిన హాలీవుడ్ నటుడు రెక్స్‌హారిసన్‌ది ఎడమచేతివాటం. ఆయనకు ఒక కన్ను లేదు. ఎడమ కన్నే బాగా చూడగల్గుతుంది. కుడి కంటిపాప నకిలీది.

'క్రాంతి' లో జయంతి



ఈ కథ చిత్రీకరణకు గుప్పెడు చోటు కోసం దేశమంతా గాలించాం. చివరకు దొరికింది.... సుహాసిని హృదయంలో!

K.బాలచందర్

భారత్ ఫిలిమ్స్

# ఇది కథ కాదు

నిర్మాత: టి.విశ్వేశ్వరరావు

ఫొటోగ్రఫీ: బి.ఎస్.లోకనాథ్

మాటలు: గణేష్ పాత్రో పాటలు: ఆచార్య ఆత్రేయ సంగీతం: ఎం.ఎస్.విశ్వనాథన్.

లక్ష్మీఫిలింస్

# ప్రశ్నావళి



—కె. రామలక్ష్మి

టి. హెచ్. ఎస్. — భువనగిరి

మానవ జీవితంలో ఏది పాపం? ఏది పుణ్యం?

★ పాపపుణ్యాల బేరీజు వేయడానికి మనం ఎవరం? సిట్యుయేషన్‌నిపట్టి — వుంటాయి పాపపుణ్యాలు.

సి. ఎస్. బి. — హైదరాబాదు

మీకు ఎవరంటే ఎక్కువ అభిమానం అన్న ప్రశ్నకి కవుల గురించి ఏమీ చెప్పలేదు. ఏం మీవారి పేరు చెప్పవలసి వస్తుందనా? లేక కృష్ణశాస్త్రి గారి పేరు చెబితే చేదా?

★ అయ్యో బాబూ — కవి పేరు చెప్పడం కష్టం? ఎవరని చెప్పను కవిగా ప్రేమించి పెళ్లి చేసుకున్న ఆరుద్రగారి పేరు చెప్పి వూరుకోనా? కృష్ణశాస్త్రిది కవిత అని మెచ్చిన శాస్త్రిగారి పేరు చెప్పకపోతే వారు కవి కాకుండాపోతారా?! మీరు మరీ ముక్కుదాటి చూడని మనస్తత్వం నుంచి బయటపడాలి... ఏ కవి కవిత చదివినా నా కిష్టం. ఆధునిక కవులందరినీ నేను చదువుతాను... ప్రత్యేకించి రాయడం దేనికి? అలాగే ఆధునిక సీరియల్, నవలా, పెద్ద కథా, చిన్న కథా రచయిత రచయిత్రిలని — నిజ, చోర నామ రచనా నామధేయులని అందర్నీ — చదివి సంతోషిస్తూ వుంటాను. లేకపోతే — బుర్ర మొద్దుబారిపోతుందని నాకు భయం... సమకాలికత అంటే నాకేం సిగ్గు లేదు; అసహ్యమూ లేదు.

బి. పి. పి. — పాలమర్తి

ద్వేషించేవారి ద్రోహాన్ని భరించవచ్చుగాని ప్రేమించేవారి ప్రేమ త్యాగాన్ని భరించలేము అంటారెందుకు?

★ చాపకింద నీరులాగా వీరి త్యాగించిన ప్రేమ ఎదుటివాళ్ల జీవితంనిండా పరచుకొని — నరకంగా తయారుచేస్తుందనేమో — అలా అంటారు!

ఎన్. పి. పి. — కర్నూలు

కట్నాలు తీసుకోరాదు. కట్నానికి గుడ్‌బై అంటూ వేదికలెక్కి చెప్పే యీ మగమహారాజులే రహస్యంగా కట్నాలకు సిద్ధం అవుతూవుంటారు. దీనికి మీరేమంటారు!

★ పిరికితనం! డూప్లిసిటీ. హిపోక్రసీ — చాలా పేర్లుంటాయి. దానికేంగాని — ఇలా రహస్యంగా ఏనా కట్నం పుచ్చుకొని చెప్పే తత్వం గల వారినేమందాం?

హుసెన్ — కావలి

ఒక మగవాడికి ఇద్దరు భార్యలు. చట్టం కాకపోయినా సమాజం ఏదో విధంగా ఒప్పుకుంటూంది...

★ అడ్డదారి తొక్కడానికి సిగ్గుపడని ఆడ–మగ ఉన్నంత కాలం యిలాంటి సద్దుబాట్లు ఉంటూవుంటాయి.

అప్పడాల కర్రలతో అట్లకాడలతో భర్తల తల బాట్మింటెన్ ఆడుతున్నట్టు వేసే కార్టూనులకు పత్రికలు అధిక ప్రాధాన్యం యిస్తున్నాయి. కామెంట్?

★ తీరని కోరికలు మరీ బాగుంటాయన్న దానికి ఇవీ నిదర్శనాలే!

ఆర్. బి. ఎస్. — గుడివాడ

రాముడు ఆదర్శపురుషుడు అంటారు. సీత మీద నిందమోపి అవమానించినవాడు ఆదర్శ పురుషుడని ఎలా అంటాం?

★ సీతని రాముడు నమ్మకపోలేదు. లోకాన్ని కూడ నమ్మించాలని పాపం రాముని తాపత్రయం!

వై. పి. ఎల్. — పెండేకల్

మీ జవాబులు ఘాటుగా వుంటాయి. మీ పేరు కలవాళ్ళు గడుసుగా వుంటారు. పేరుకీ—గడుసుతనానికీ సంబంధం వుందా?

★ బలేదానివే చిట్టితల్లీ. పి. రామలక్ష్మిని చూడు — నోట్లో నాలుక లేనట్టు — ఉట్టి అమాయకంగా వుంటుంది! నాకో? మా మేనత్త పేరు. ఆవిడగారు బహు గడసరే కాదు — మాటకారి. అందుకే చిన్నప్పుడూ పెద్దయ్యాక కూడా గోరాశాస్త్రి 'రేవాసర్కార్' అని ముద్దుగా పిలిచేవాడు నన్ను. (ఆడపిల్లని ముద్దుగా పిలవడం ఆయనగారికి వెన్నతోపెట్టిన విద్య!) ఇక మరి ఆ రేవాసర్కార్ ఎవరని నా ప్రాణంతోడక — గురజాడవారి తుని కనెక్షన్ తెలుసుకో!

జి. కె. ఆర్. — బొబ్బిలి

పేరులోనే 'రామ' అని మగవారి పేరు పెట్టుకుని విమర్శిస్తారేం మగవాళ్ళని?

★ రామ స్త్రీ శబ్దం స్వామీ! రాముడులో రామ కాదిది. రమ్యతిరామ! ఒప్పుకోకపోతే నేనేం — చేయలేను!

జి. వి. కె. ఎమ్. — విజయవాడ

ఒక అతను నా జీవితాన్ని నరకప్రాయం చేస్తున్నాడు. హత్య చేయాలన్నంత ఆవేశంగా కసిగా వుంది.

★ ఆవేశం కసి — ఆత్మహత్యాసదృశం. అవేం మీకు దారి చూపవు. అనవసరంగా మిమ్మల్ని మీరు హింసపెట్టుకుంటున్నారు. కోపంగా ఆలోచించకండి.

డి. జె. — పెద్దభైనపల్లి

కష్టించి పనిచేసేవారికి తిండి దొరకదు. కావున దొంగతనం చేస్తే తప్పా?

★ దొంగతనమే ఎందుకు చేయాలి? దేహీ అని అడుక్కోడం కూడా రైటే కద!

నస్రీన్ — మంగళగిరి

తల్లే చల్లని దైవం. మరి తండ్రి?

★ పూజారి.

టి. ఏ. ఆర్. ఎమ్. — గుడివాడ

దాదాపు ప్రతి సినిమాలోను స్త్రీని చిత్రహింస చేస్తున్నట్లు చూపిస్తుంటే సెన్సారుబోర్డు సభ్యురాలిగా మీరేం చెయ్యకల్గుతున్నారు?

★ నా మొఖం ఒక్క ఓటుకి విలువేంటి? స్త్రీని హింస పెట్టడం అనరు — ప్రేక్షకులచేత కంట తడి పెట్టించడానికి అంటారు. జంతు హింస కూడదన్నారుగాని స్త్రీ హింస కూడదని ఎక్కడా లేదే?! ఒక చిత్రంలో ఒకలా చిత్రహింసలు పెట్టేస్తే యింకో చిత్రంలో అంతకుమించిన వెరైటీ చూపెట్టాలి కద — లేకపోతే మీ పాఠకులు వూరుకోరుకదా అంచేత ఇంకోరకం చిత్రహింసల గురించి — దర్శకులు, కథకులు, నిర్మాతలు ఆలోచిస్తూనే వుండాలి. అప్పుడే వెరైటీ అంటారే అది సిద్ధిస్తుంది. ఈలోగా చిత్రంలో స్త్రీ — "ఇవిగో కండలు — ఇవిగో మాంసం ముక్కలు" అన్నట్టు — పార్టు పార్టుగా అయిపోతేనేం? అదీ ఓ వెరైటీ అనుకోండి!

వి. వి. ఎల్. ఆర్. — సికింద్రాబాదు

నిదానం ప్రధానం?

★ తొందరపాటు పరాజయానికి నాంది కావచ్చు.



# అన్నా-చెల్లెలు

[ 27వ పేజీ తరువాయి]

మాస్తాను' అంది. అన్నయ్య బాగానే లావు అయ్యాడు. చూపుడువేలు గనక ముసలిదానికి అందిస్తే, వేలు లావును బట్టి తను లావు ఎక్కినట్టు కనుక్కుని, తనని తినేస్తుంది. గాబట్టి తన వేలు బదులు ఒక బొమికను దానికి అందిస్తాను. అది సన్నగా వుంటుంది కదా! అది చూసి తను లావుయెక్కలేదని భ్రమిస్తుంది అనుకున్నాడు. అనుకున్న విధంగానే అతడు అందించిన బొమికను చేతితో ముట్టుకుని చూసి 'ఇంకా నీ వేలు బొమికలాగే వుంది. ఇంకా కండపట్టలేదు' అంటూ వెళ్ళిపోయింది.

ఇలా చాలారోజులు గడిచాయి. ప్రతిసారి బోనులో నుండి ఎముకను ముసలిదానికి చూపించి 'ఇంకా నేను సన్నగానే వున్నాను' అనేవాడు. కొన్నిరోజులకు ముసలిదానికి ఓపిక పోయింది. 'ఇక నీకోసం కాచుకుని కూర్చోలేను. నువు సన్నగావున్నాసరే, ఇవాళే తింటాను' అంది. అతడ్ని వండటానికి, అతడి చెల్లెలకు పురమాయించింది.

'పొయ్యి బాగా మండుతోందోలేదో చూడు. ఇప్పుడు వాడిని వండాలి' అంది.

చెల్లెలు భయపడింది. ఇప్పుడే ఎల గైనా ఇద్దరం తప్పించుకోవాలి అనుకుంది.

'మంట సరిపోతుందోలేదో నాకు సరిగా తెలియడంలేదు. నువ్వు ఒక్కసారి చూడు' అంది చెల్లెలు.

ముసలిది విసుక్కుంటూ పొయ్యికి బాగా దగ్గరగా వెళ్ళి చూసింది. అదే సమయంలో చెల్లెలు ముసలిదానిని పొయ్యిలో పడేట్టుగా బలంగా ఒక్కతోపు తోసింది. ముసలిదానికి మొహం కాలి, ఆ బాధకు తట్టుకోలేక చచ్చింది. చెల్లెలు గబగబా ముసలిదాని బొడ్లో వున్న తాళంచెవి తీసుకుని, బోను తాళం తీసింది. అన్నయ్య బోనులోంచి బయటపడ్డాడు. ఇద్దరూ ఎంతో సంతోషించారు, ముసలిదాని పీడ వదిలినందుకు. ఇద్దరూ ఆ ఇల్లంతా తిరిగి చూసారు. ఒక గదిలో మూల బంగారు, వెండి నాణాలతోపాటు ఎన్నో నగలు కనిపించాయి. ఆ సమయంలో వారికి తమ పేదతనం గుర్తుకువచ్చింది. వాళ్ళు మోయగలిగినంత బంగారం, వెండి నాణాలు, నగలు తీసుకుని ఇంటి బయటకు వచ్చారు. అక్కడ ఈ ఇంటికి దారి చూపించిన తెల్లటి పక్షి కనిపించింది. వీళ్ళను చూడగానే అది ఆకాశంలోకి ఎగిరింది. అది వెళ్ళినవేపే పరుగెత్తుకుంటూ వెళ్ళారు అన్నాచెల్లెలు. అలా వెళ్ళి వెళ్ళి తమ ఇంటి పరిసరాలకు చేరుకున్నారు. ఆ పక్షి మళ్ళీ వెనక్కి వెళ్ళిపోయింది. అన్నాచెల్లెలు ఇంటికి వెళ్ళి తలుపు తట్టారు. తల్లిదండ్రులు వీళ్ళను చూసి కౌగలించుకుని, తమని క్షమించమని అడిగారు. తర్వాత అందరూ హాయిగా వున్నారు.

— బాబు ★




# విలువ

ఓ దేవుడా
ఎందుకు పుట్టించావు బీదరికంలో
అయినా భరిస్తున్నాను.
మనిషికి మనిషికి మధ్య గల
తారతమ్య లోకంలో.
నా నివాసపు ప్రదేశాలు
ఎండాకాలం చెట్టుక్రింద
వానాకాలం బ్రిడ్జిక్రింద
జీవించటానికి చాలు పట్టెడు మెతుకులు.
నాకున్నాయి హక్కులు
ప్రతి ఇంటివద్ద అడుక్కోటానికి
ప్రతి మనిషిని అడుక్కోటానికి
ఉన్నాయి నాకు విలువలేని హక్కులు.
పట్టెడు మెతుకులు
భరించలేదు ఈ లోకం
విలువ లేని నా కోసం
కానీ అర్థిస్తోంది ఈ లోకం
విలువ కలిగిన నా ఓటు కోసం.

— మాదపాటి భాస్కరరావు

# ధర్మపథం

## పాణిగ్రహణం

పాణిగ్రహణం అంటే వివాహం. కాని దీని వాడుక చాలా అరుదైపోయింది. పెండ్లి శుభలేఖల్లో "వివాహమహోత్సవాహ్వానపత్రిక" అని అంటారే గాని "పాణిగ్రహణోత్సవాహ్వాన శుభపత్రిక" అని వ్రాయడం కాని, అచ్చు వేయడం కాని ఉండదు. కాని పెండ్లి తంతులో పాణిగ్రహణమే ప్రధానమైనది. మంగళసూత్రధారణ, జీలకర్ర బెల్లాలను తలపై ఉంచడం ఆ తర్వాతివే! అవి పూర్వం అంత ప్రధానంగా వుండేవికావు. కొన్ని ప్రాంతాలలో ఇప్పటికీ మంగళసూత్రధారణ లేనేలేదు. ఇక జీలకర్ర బెల్లాల సంగతి చెప్పనక్కరయేలేదు.

వరుడు వధువు చేతిని తన చేతితో పట్టుకొని, అగ్నికి ప్రదక్షిణం చేయించి, ధర్మార్థ కామములందు అతిక్రమించను (ధర్మేచ అర్థేచ, కామేచనాతిచరామి) అని ప్రమాణం అగ్నిసాక్షిగ చెయ్యడం వివాహంలో ముఖ్యమైనది వరుడు వధువుయొక్క పాణిని, హస్తాన్ని గ్రహించడం జరగుట వల్లనే "పాణిగ్రహణం" అనే పేరువచ్చింది. రామాయణంలో సీతా వివాహ సందర్భంలో జనకమహారాజ శ్రీరామునితో ఇలాఅంటాడు.

"ఇయం సీతా మమ సుతా
సహ ధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం, భద్రంతే!
పాణిం గృహ్ణీష్వ పాణినా"

ఇదిగో! నా పుత్రిక అయిన సీతను నీకు సహధర్మచారిణిగా ఇస్తున్నాను. ఈమెను స్వీకరించి, నీ హస్తంతో ఈమె హస్తాన్ని పట్టుకో! నీకు శుభం కలుగుగాక! అని దీని అభిప్రాయం. ఇందులో పాణిగ్రహణమే ప్రధానంగా కానవస్తుంది. ఈ విషయాన్ని చాలామంది గుర్తించడం లేదు.

పెండ్లిలో సప్తపాదాలు తొక్కించడం ఒక సంప్రదాయం. ఏడడుగులు కలిసి మెలిసి నడిచినా, ఏడు పదాలు ఆప్యాయంగా మాటలాడినా స్నేహం కలుగుతుందని వాడుక. అందువల్లనే "సఖ్యం సాప్తపదీనం" అనే లోకోక్తి ఏర్పడింది. భార్యభర్తలు కీచులాడుకొనకుండా పరస్పరం స్నేహంకల్గి ఉండాలన్నదానికి ఇది సూచకం ఈ అభిప్రాయాన్ని కూడా చాలామంది గ్రహించరు.

వివాహపు తంతు ముగిసిన తర్వాత "అప్పగింతలు" లాంఛనంగా వస్తున్నది. అప్పుడీశ్లోకం చెప్తారు.

"అష్టవర్షా భవేత్కన్యా
పుత్రవత్పాలితా మయా,
ఇదానీం తవ దాస్యామి
దత్తా స్నేహేన పాల్యతామ్!

ఎనిమిదేళ్ళున్న యీ కన్యను పుత్రుని వలె పెంచాను ఇప్పుడు నీకు దానం చెయ్యబోతున్నాను. దానం గ్రహించిన తర్వాత ఎంతో స్నేహంతో దీన్ని చూసుకోవాలి — అని దీని భావం.

కన్యకు ఎనిమిదేళ్ళ వయస్సులో పెండ్లి చేస్తూవుండిన కాలంలో ఈ శ్లోకం పుట్టిందని తోస్తుంది. "దాస్యామి" అంటే "ఇవ్వబోతున్నాను" అని అర్థం కాబట్టి వివాహానికి ముందే ఈ తంతు జరగవలసి వున్నది. అంతేకాక, కన్యాదానం వరునకే కాని, వరుని తల్లిదండ్రులకు కాదుగదా! ఈ స్థితిలో వరుని తల్లిదండ్రులకూ, ఇంకా ఆ పక్షంలోని ఇతరులకూ ఈ శ్లోకం చదువుతూ అప్పగించడంలో అర్థంలేదు. అయితేనేమి? అది ఆచారమైపోయింది.

— బులుసు వేంకట రమణయ్య




లైటు వెలుగుతోంది. మంచం మీద పడుకుని తన భార్య రాసిన కథ చదువుతున్నాడు గోపాలరావు. పైన ఫ్యాను ఫుల్ స్పీడ్‌లో తిరుగుతోంది. అప్పటికి రాత్రి పది గంటలు దాటింది. అతనికి నిద్ర వస్తోంది. ఐనా పట్టుదలగా ఆ కథను చదువుతున్నాడు.

కథ బాగా వుంది. అందులోనూ అది తన భార్య లలిత రాసిన కథ.

గోపాలరావుకు సాంఘిక కథలు చదవడం ఇష్టం లేదు. ఎప్పుడయినా డిటెక్టివ్ నవలలు చదివేవాడు. సినిమా పత్రికల్లో బొమ్మలు చూసేవాడు. అతను పెళ్ళి చూపులకు వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి కథలు రాస్తుందని అతనికి తెలిసింది. ఐనా అతను అంతగా పట్టించుకోలేదు. లలిత బావుంది. చేసుకున్నాడు. అంతే.

అతను ఓ ప్రఖ్యాత రచయిత్రిని చేసుకున్నాడని తెలిసిన తర్వాత అతన్ని ఫ్రెండ్సందరూ అభినందించారు. రచయిత్రిగా భార్య విలువను అప్పుడు తెలుసుకున్నాడు గోపాలరావు. అతనికి బాగా సంతోషం కలిగింది. రచయిత్రిని చేసుకోవడం వల్ల తన వాల్యూ కూడా పెరిగినట్లు అర్థం చేసుకున్నాడు.

సినిమా తారల తర్వాత కథలు రాసే వాళ్ళంటే, అదీనూ రచయిత్రులంటే బాగా క్రేజ్ వుందనీ తెలుసుకున్నాడు. లలితతో కలిసి హైదరాబాదులో కొత్త కాపురం పెట్టిన తర్వాత ఆ వీధిలో వాళ్ళందరికీ చాలా తక్కువ వ్యవధిలోనే ఈ మధ్య పుధ్ధృతంగా కథలు రాస్తున్న లలిత ఆ వీధిలోనే అద్దెకు వచ్చినట్లు తెలిసింది. ఇక ఆ రోజు నించీ రోజూ ఎవరో ఒకరు లలితను చూట్టానికి రావడం మొదలు పెట్టారు. వాళ్ళలో ఎక్కువ మంది కాలేజీలో చదువుకుంటున్న అమ్మాయిలే.

అప్పటినించీ గోపాలరావు రోడ్డు వెంట వెళుతుంటే "కథలు రాసే లలితగారి భర్త ఈయనే" అని సాయంత్రంపూట అరుగుల మీద కూర్చుని కబురు చెప్పుకుంటున్న ఆడవాళ్ళు చిన్నగా చెప్పుకోడం అతను ఎన్నోసారు విన్నాడు. అతనికి అప్పుడు లలితమీద అభిమానం రెండింతలయిపోయింది. లలితమూలంగా తనకి ఎంత గుర్తింపూ? పైగా లలిత వచ్చినవారందరికీ తను కథలు రాయడంలో తన భర్త ఎంతగానో సహకరిస్తున్నాడని చెబుతోంది... గోపాలరావు పొంగిపోతున్నాడు.

కాపురానికి వచ్చే నాటికి లలిత నలభై కథలు పైగానే రాసింది ఐనా నాటిలో గోపాలరావు ఒక్క కథను కూడా చదవలేదని తెలిసి లలిత ఎంతో బాధ పడింది. కథలు చదవడం అలవాటు చేసుకోమని గోపాలరావుకు ఎన్నోసార్లు చెప్పింది.

చదువుతానన్నాడు గోపాలరావు.

ఓరోజు గోపాలరావు ఆఫీసులో పని చేస్తున్న రాజేశ్వరి "పోయినవారం మీ మిసెస్

రాసిన "అన్వేషణ" కథ చదివారు కదా" అని అడిగింది.

చదవలేదని చెబితే బావుండదని తల వూపాడు గోపాలరావు.

"ఆ కథలో రాజశేఖరం పాత్ర నాకు అంతగా అర్థం కాలేదండీ ... అంతగా ప్రేమించిన మనిషిని వదిలేసి ఎవరో, ఎవరో వూరూ, పేరూ లేని అమ్మాయిని అతను ఎందుకు చేసుకున్నాడు ?" అని అడిగింది.

గోపాలరావుకు ఏంచెప్పాలో అర్థం కాలేదు... తర్వాత "నాక్కూడా ఆ పాత్ర అంతగా అర్థం కాలేదండీ" అన్నాడు నసుగుతున్నట్టు.

"సర్లెండి, నేనెవర్ని మీ మిసెస్ ను అడుగుతాను" అన్నది రాజేశ్వరి.

అప్పటికి బతికిపోయాడు గోపాలరావు.

ఇలాంటి పరిస్థితులు అప్పుడప్పుడు ఎదురవుతాయని గ్రహించి తను లలిత రాసిన కథలు చదవకపోవడం బావుండదని వివిధ పత్రికలో పడిన కథలన్నింటినీ ముందేసుకుని చదవడం మొదలు పెట్టాడు.

లలిత ఇంట్లో లేదు. మూడు రోజుల క్రితం వాళ్ళ అన్నయ్య కొడుక్కు అన్న ప్రాసనకు వెళ్ళింది.

అప్పటికే పన్నెండుకు పైగా కథలు చదివాడు గోపాలరావు. కథలన్నీ బాగానే వున్నాయి. ముఖ్యంగా లలిత కథలు రాసిన తీరు చాలా బావుంది.

లలిత రాసినవన్నీ ప్రేమకథలే. అన్ని కథలూ చదివిన తరువాత అతను ఓ ఆశ్చర్యకరమయిన విషయాన్ని గ్రహించాడు. ఏమిటంటే తను చదివిన పన్నెండు కథల్లోనూ పది కథల్లో హీరో పేరు మోహన రావు...దాదాపు ప్రతి కథలోనూ లలిత-మోహన రావు పేరు ఎందుకు పెట్టిందో గోపాలరావుకి అర్థంకాలేదు.

పదమూడో కథ చదవడం మొదలు పెట్టాడు ఓ పేజీ తర్వాత హీరో బయటకు వచ్చాడు. అతని పేరూ మోహన రావే. పైగా ఆ కథ జరిగిన ప్రదేశం లలిత సొంతవూరు. ఆ కాలేజీకూడా లలిత చదివిన కాలేజే. ఊరూ, ప్రదేశాలూ నిజమయినప్పుడు మోహనరావు కూడా నిజమయివుండవచ్చునని అనుమానం గోపాలరావుకు వచ్చింది.

అలా అనుమానం రాగానే గోపాలరావు ఆ కథను బాగా శ్రద్ధగా చదివాడు. ఆ కథలో హీరోయిన్ కూడా రచయిత. హీరో అయిన మోహనరావు హీరోయిన్ సరోజిని కథలు రాస్తుందని తెలుసుకుని ఆమెతో పరిచయం చేసుకుంటాడు. కొద్దికాలం లోనే సరోజిని హృదయాన్ని దోచుకుంటాడు. ఇద్దరూ బాగా దగ్గరైపోతారు. గాఢంగా ప్రేమించుకుంటారు. పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. ఈ విషయం తల్లి దండ్రులతో చెబుతుంది సరోజిని. కానివాళ్ళు ఒప్పుకోరు. మోహనరావు మరీ బీదవాడనీ, అతడిని చేసుకుంటే తన శవాన్ని కళ్ళ జూడవలసి వస్తుందనీ బెదిరిస్తుంది తల్లి. చివరికి సరోజిని, మోహనరావువిడిపోతారు. తర్వాత సరోజిని ఎవర్నో పెళ్ళి చేసుకుంటుంది మోహనరావు కూడా గతాన్ని మరచిపోయి మరో అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. కథ పేరు రాజీ.

కథ చదివి పత్రికను టేబిల్ మీదకు విసిరేశాడు గోపాలరావు. అతని ఆలోచనలన్నీ లలిత మీద వున్నాయి. ఈ కథ నిజంగా కథేనా ? లేక లలిత సొంత కథా ? చదువుతుంటే నిజంగా జరిగినట్టు అనిపిస్తోంది. ఒకవేళ లలిత నిజంగానే మోహనరావు అనే మనిషిని ప్రేమించిందేమో !

అతనికి నిద్ర పట్టలేదు. మనసంతా గజిబిజి అయింది. టేబిల్ మీది సిగరెట్ పాకెట్ని అందుకున్నాడు, ఓ సిగరెట్ ముట్టించాడు. తీవ్రమయిన ఆలోచనలో మునిగి పోయాడు. ఓ పదినిమిషాల తర్వాత అతనికి ఓ ఆలోచన వచ్చింది.

లేచి నిల్చున్నాడు.

తలుపులు తెరుచుకుని మధ్యగదిలోకి వెళ్ళాడు. తన భార్య పుట్టింటి నించి బట్టలు పెట్టుకుని తీసుకువచ్చిన పెట్టెను తెరిచాడు. అందులో నాలుగైదు చీరలూ, జాకెట్లూ, పావడాలూ వున్నాయి. వాటన్నింటినీ తీసి కింద పారేశాడు. పెట్టె అడుగున ఓ న్యూస్ పేపరు పరచివుంది. దాన్నికూడా తీసేశాడు. అడుగున ఉత్తరాలు కనిపించాయి.

ఆత్రంగా వాటిని చేతిలోకి తీసుకున్నాడు. మళ్ళీ బెడ్ దగ్గరకు వచ్చి కూర్చున్నాడు.

ఓ ఉత్తరం మడత విప్పాడు. అది లలిత స్నేహితురాలో కృష్ణవేణి దగ్గర్నించి వచ్చిన ఉత్తరం.

మరో ఉత్తరాన్ని చూశాడు. అది మరో స్నేహితురాలు వాణీకుమారి రాసిన ఉత్తరం. ఓపిగ్గా ఒక్కో ఉత్తరాన్నే జాగ్రత్తగా చూస్తున్నాడు. చివరికి అతని కృషి ఫలించింది. ఓ ఉత్తరం మీద సంతకం చూడగానే అతని కళ్ళు మెరిశాయి. 'మోహనరావు' అని వుంది.

గబగబా చదవడం మొదలు పెట్టాడు

లలితగారికి—

ఈ మధ్య మీ కథలు చదవడం నాకు కుదరడం లేదు. రెండు రోజుల క్రితమే సిరిమల్లె మాసపత్రికలో పడిన మీ 'మరచిపోకు ప్రేమికుడా' కథ చదివాను. ఆ కథ చదువుతుంటే నాకు ఏవో పాత స్మృతులు గుర్తుకు వచ్చాయి. మళ్ళీ నాకు అలాంటి అనుభూతిని కలిగించినందుకు థాంక్స్. త్వరలోనే మీ మరో కథ చదువు తానని ఆశిస్తాను.

— మోహనరావు.

ఆ ఉత్తరాన్నే మళ్ళీ చదివాడు. దాని మీద తారీకు చదివాడు... మూడు నెల్ల క్రితం రాసిన ఉత్తరం.

గోపాలరావు గుండెల్లో ఓ విధమైన మంట చెలరేగింది.

అంటే తను అనుమానించింది నిజమేనన్న మాట. లలిత మంచిది కాదు. ఇంకా ఆ మోహనరావుతో ప్రేమ వ్యవహారాన్ని సాగిస్తోందా? ఏమో! రాగానే తేల్చుకోవాలి.

సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ ఆ రాత్రంతా గడిపాడు గోపాలరావు.

* * *

"మూడురోజుల క్రితమే వస్తానన్నావుగా" అడిగాడు గోపాలరావు పుట్టింటి నించి వచ్చిన భార్య లలితతో.

"మా వాళ్ళు వదల్లేదండీ. మా అక్కయ్య మరీ గొడవ. ఇంకా వుండకపోతే బావుండదని... అన్నయ్య, మా బావగారు మీ గురించి అడిగారు. తమ్ముడు కూడా వస్తే బావుండేదని. మీకెప్పుడూ ఆఫీసు పనులే. ఇంత సరదాగా వుండరు ఎప్పుడూ" అన్నది లలిత.

"మోహనరావు కనిపించాడా ఇంతకూ?" ఉన్నట్టుండి అడిగాడు గోపాలరావు

"మోహనరావా? అతనెవరు?" ఆశ్చర్యంగా అడిగింది లలిత.

"మోహనరావు తెలీదూ? నీ కథల్లో హీరో" ఆదోరకంగా అడిగాడు.

"కథల్లో హీరో బయట ఎలా కనిపిస్తాడు? ఐతే ఇంతకీ నేను రాసిన కథలన్నీ చదివారన్నమాట" నవ్వుతూ అన్నది లలిత.

"చదివానులే... ఇంతకీ ఆ హీరో ఎవరు? ఎక్కడ వుంటాడు?"

"హీరో ఎక్కడుండేదేమిటండీ... మీరేం మాట్లాడుతున్నారో నాకు అర్థం కావటం లేదు"

"నువ్వు రచయిత్రివేకాదు మంచి నటివి కూడా. మోహనరావు నీకు తెలీదా?"

"ఏ మోహనరావు?"

"నీ అభిమాని."

"ఓ... అతని గురించా మీరు అడిగేది? అతను రాసిన ఉత్తరం మీరెప్పుడు చదివారు?"

"ఎప్పుడో చదివానులే... అతను ఇప్పటికీ ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడా?"

"లేదండీ... అప్పుడేదో నేను రాసిన కథ తన పాత స్మృతులను గుర్తుకు తెచ్చిందని రాశాడు..."

"సరే... ఇద్దరూ ఎందుకు పెళ్ళి చేసుకోలేక పోయారు?" షాక్ కొట్టినట్టు అదిరిపడింది లలిత.

"ఈ రోజు మీ ప్రవర్తన చాలా వింతగా వుంది. మనసులో ఏదో వుంచుకొని మాట్లాడుతున్నారు. నేనేమీ అనుకోను... డైరక్టుగా అడగండి" అన్నది లలిత.

"డైరక్టుగానే చెబుతాను... నువ్వు, మోహనరావు ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. కాని అతను బీదవాడు కావటం వల్ల మీ వాళ్ళు ఒప్పుకోలేదు. నువ్వు నన్ను చేసుకున్నావు. మోహనరావు మరెవర్నో చేసుకున్నాడు. అవునా?"

"అర్థమైంది... మీరు 'రాజీ' కథ గురించి చెబుతున్నారు" అన్నది లలిత.

"అవును. ఆ కథ నీ కథే. నీ కథను నువ్వే రాసుకున్నావు."

"అంత గట్టిగా మీరెలా చెప్పగలరు?"

"ఆ కథలో వున్నది మీ వూరే. హీరోయిన్ సరోజిని చదివింది నువ్వు చదివిన కాలేజీలోనే. ఆ పరిసరాలన్నీ నిజంగా వున్నవే. ఇన్ని నిజమైనప్పుడు మోహనరావు నిజమయిన వ్యక్తి ఎందుకు కాడు?"

"కాదు. ఆ కథలో మా వూరు వుండవచ్చు. మా కాలేజీ వుండవచ్చు. అంత మాత్రాన ఆ కథ నాకథే అనడం అన్యాయం. ఆ కథలోలాగా మా స్నేహితురాలికి జరిగి వుండవచ్చు. లేదా మరొకరికి జరిగితే నాచురాలిటీ కోసం నేను నాకు తెలిసిన వాతావరణాన్ని సృష్టించి వుండవచ్చు. అందులో మోహనరావు కల్పిత వ్యక్తి."

"నేను నమ్మను. ఆ ఒక్క కథలోనే కాదు, నువ్వు రాసిన ప్రతికథలో హీరో మోహనరావే. ప్రతి కథలోనూ ఆ పేరునే ఎందుకు పెట్టాలి? ఇంకా నీకు పేర్లే దొరకలేదా? ఆ మాత్రం అర్థంచేసుకోలేని వాడినికాదు. మోహనరావు నీ ప్రియుడు. ఇప్పటికైనా ఒప్పుకో" అన్నాడు గోపాలరావు కోపంగా.

లలితకు గోపాలరావును ఎలా నమ్మించాలో అర్థంకాలేదు. ఆమె కనులకు అతను గొప్ప మూర్ఖుడిలా కనిపించాడు. అతన్ని చేసుకున్నందుకు మొదటిసారిగా బాధ పడింది. రచయిత్రి కావడం తన దురదృష్టమేమో అనుకుంది.

"అన్ని కథల్లోనూ మోహనరావు పేరు వుండటమే మీరు నన్ను అనుమానించడానికి కారణం అనుకుంటాను. ఒక్కొక్క రచయిత లేక రచయిత్రికి ఒక్కొక్క పేరుమీద ఎందుకో ఇష్టం వుంటుంది. లేదా ఆ పేరు పెట్టిన కథలు ఎక్కువగా అచ్చవడంవల్ల ఆ పేరు కలిసివస్తుందని ఎక్కువ కథల్లో ఆ పేరే పెట్టడం జరుగుతుంది. నా విషయంలోనూ అంతే. మిగిలిన పేర్లు పెట్టి రాసిన కథలన్నింటిలో మోహనరావును హీరోగా పెట్టి రాసిన కథలు ఎక్కువగా అచ్చయినాయి. నేను రాసే కారెక్టర్లకు మోహనరావు పేరు బాగా సూటవుతుంది. అందుకే నేను ప్రతి కథలో ఆ పేరు పెడతాను. అంతేగాని మోహనరావుకీ నాకూ ఎలాంటి సంబంధమూ లేదు. నన్ను నమ్మండి" అన్నది లలిత.

గోపాలరావు మాట్లాడలేదు. లలిత మాటలను నమ్మలేదు. అతనిలో చోటుచేసుకున్న అనుమాన భూతం తొలగిపోలేదు.

ఆ రోజు నుంచి అతను లలితను మాటలతో హింసించటం మొదలు పెట్టాడు. రోజుకోసారైనా ఆ మోహనరావు ఎవరో, ఎక్కడ వుంటాడో, ఏం చేస్తుంటాడో చెప్పమని అడుగుతూనే వున్నాడు.

రోజు రోజుకీ లలిత జీవితం నరకంగా మారిపోవటం మొదలు పెట్టింది. లలిత ప్రతి చర్యనూ గోపాలరావు అనుమానించడం మొదలు పెట్టాడు. ఓసారి పుట్టింటికి ఉత్తరం రాస్తుంటే "ఆ మోహనరావుగాడికేనా ఉత్తరం?" అని అడిగాడు. ఆ మాటతో లలితకు గోపాలరావంటే పూర్తిగా అసహ్యమేసింది. అతడిని వదిలి పుట్టింటికి వెళ్ళిపోదామనుకుంది. కాని— తొందర పడటం మంచిది కాదని అతడి మాటలనూ ప్రవర్తననూ సహిస్తూ అక్కడే వున్నది. తన తప్పును గోపాలరావు తెలుసుకుంటాడని ఎదురు చూస్తోంది.



ఇద్దరి మధ్య మాటలు లేకుండా పోయాయి.

ఇలా వుండగా ఓ రోజు లలిత ఎప్పుడో ఓ వారపత్రికకు పంపిన కథ అచ్చయి పత్రిక ఇంటికి వచ్చింది. ఆ కథను గోపాలరావు చదివి మరీ మండిపడ్డాడు. ఆ కథలో హీరో పేరూ మోహనరావే.

లలిత ఏమీ మాట్లాడలేదు.

ఆ రోజు సాయంత్రం గోపాలరావుకు కోఠీ సెంటర్లో తన కాలేజ్‌మేట్ సూర్యారావు కనిపించాడు.

"ఏరోయ్ ఇక్కడ తిరుగుతున్నావ్?" గోపాలరావే ముందుగా అతన్ని చూసి పలకరించాడు.

"ఈమధ్యనే ఇక్కడకు ట్రాన్స్‌ఫరయింది. నల్లకుంటలో వుంటున్నాను." చెప్పాడు సూర్యారావు.

ఇద్దరూ దగ్గర్లోవున్న హోటల్లోకి వెళ్ళికూర్చున్నారు. "ఏమిటి విశేషాలు?" అడిగాడు గోపాలరావు.

"ఏమున్నాయ్ అంతా కులాసా... ఈ మధ్యనే నా చెల్లెలు పెళ్ళి చేశాం. రేపల్లె ఇచ్చాం"

"ఊఁ... ఇంకా కథలు రాస్తూనే వున్నావా?"

"ఆఁ... ఏం కథలూ? వెధవ కథలు, విసుగుపుట్టింది. వెధవ న్యూసెన్స్ రాయడం మానేశాను" అన్నాడు అదోలా సూర్యారావు.

"ఏం? ఎందుకు మానేశావ్?"

"అదంతా ఓ కథలే"

గోపాలరావు ఏదో అడగబోయేడు. ఇంతలో సర్వరు వచ్చాడు. సూర్యారావు రెండు ప్లేట్లు ఉప్మా చెప్పాడు.

"ఏమిటి ఆ కథ?" కుతూహలంగా అడిగాడు గోపాలరావు. తర్వాత. అతని మనసులో తన భార్య లలిత వుంది.

"ఏముంది ఆ కథల మూలంగానే నా సంసారంలో కలతలు వచ్చాయి"

"కలతలా? ఎలా వచ్చాయి? వివరంగా చెప్పరా ఇంట్రెస్టింగ్‌గా వుంది" కావాలనే సూర్యారావును తొందర పెట్టాడు.

"నీకు కథలు చదివే అలవాటు లేదు కాబట్టి తెలీదు. నా కథలు ఎక్కువగా చదివే ఎవరికైనా తెలుస్తుంది నేను ప్రతి కథలో నా హీరోయిన్ పేరు 'రాజేశ్వరి' అని పెడతానని. పెళ్ళయిన తర్వాత కాపురానికి వచ్చిన నా మిసెస్ నా కథలన్నీ చదివింది. ప్రతి కథలో నా రాజేశ్వరి అని కనబడేసరికి ఆ రాజేశ్వరి ఎవరో నిజంగానే వున్నదనీ మా యిద్దరి మధ్య ఏదో సంబంధముందనీ అనుమానపడింది. ఇక నన్ను వేధించడం మొదలు పెట్టింది ఆ రాజేశ్వరి ఎవరో చెప్పమని. నిజంగా రాజేశ్వరి అ



[illegible] నాకు తెలిసి ఎవరూ లేరని చెప్పాను. వినలేదు. రోజూ నన్ను సాధించటం మొదలు పెట్టింది. ఇలా వుండగా ఆ మధ్య ఓ మాసపత్రికలో అచ్చయిన నా కథను మెచ్చుకుంటూ మా పూర్ణించి రాజేశ్వరి అనే అమ్మాయి ఓ ఉత్తరం రాసింది. అది నా మిసెస్ చేతిలో పడింది. దాంతో తన అనుమానం నిజమే ననుకుంది. అప్పట్నించీ ఆ రాజేశ్వరి ఎవరో చెప్పమని నా ప్రాణాలు తీస్తోంది. ఏవరని చెప్పేది? ఇప్పటికి ఆర్నెల్లనించీ ఇంతే. ఎవరికయినా చెప్పుకుంటే సిగ్గుచేటు. నా శ్రీమతికి మన్న మాటలు లేవు. అందుకే ఎందుకీ

# కథలురాసే భార్య!

వేధన గొడవని కథలు రాయడం మానేశాను'' అన్నాడు సూర్యారావు.

సర్వరు ఉప్మా ప్లేట్లను వారి ముందు వుంచాడు.

గోపాలరావుకు సూర్యారావు చెప్పిన మాటలు వినగానే చాలా ఆశ్చర్యమేసింది. ఆ తర్వాత బాధ కూడా కలిగింది. అన్యాయంగా లలితను అనుమానించానేమో అనే పశ్చాత్తాపం కలిగింది. ఐనా అంతటితో వూరుకోలేదు.

"అవునూ... ఇంతకీ రాజేశ్వరి అనే అమ్మాయి లేదా?'' అడిగాడు గోపాలరావు — సూర్యారావును.

"రాజేశ్వరీలేదూ పాడూ లేదు. ఎందుకో నాకు మొదటి నించీ ఆ పేరంటే ఇష్టం. అదీగాక నా కథల్లో హీరోయిన్లకు రాజేశ్వరి పేరు పెట్టినవే ఎక్కువ పాపులర్ అయ్యాయి. అప్పట్నించీ నేను ప్రతి కథలోనూ రాజేశ్వరి పేరు పెట్టటం మొదలు పెట్టాను. అన్నట్టు నీ మిసెస్ లలిత రచయిత్రే కదా... కావాలంటే ఆమెను అడుగు తెలుస్తుంది'' అన్నాడు సూర్యారావు.

ఆ మాటలు కూడా విన్న తర్వాత గోపాలరావు మనసంతా వికలమయిపోయింది. తను తన మాటలతో, ప్రవర్తనతో లలితను ఎంతటి చిత్రహింసకు గురిచేశాడో అర్థమయింది. తనమీద తనకే అసహ్యమేసింది. ఓ మనిషి మనసు తెలుసుకోకుండా కేవలం అర్థంలేని అనుమానంతో మూర్ఖుడిలా ప్రవర్తించాడు.

సూర్యారావు బిల్లు చెల్లించాడు.

రోడ్డుమీదకు వచ్చారు.

"చీకటి పడింది ఓ ముఖ్యమయిన మనిషిని కలుసుకోవాలి. నిన్ను మళ్ళీ కలుస్తాను. నువ్వు నీ మిసెస్ ఓ ఆదివారం మా ఇంటికిరండి'' అని తన అడ్రసుచెప్పి వెళ్ళిపోయాడు సూర్యారావు.

తర్వాత గోపాలరావు అక్కడే ఆగివున్న ఆటోరిక్షాలోఎక్కి తన ఇంటి అడ్రసు చెప్పాడు. అతనికి ఎంతో ఆతురతగా వుంది. తను లలిత పట్ల చాలా దారుణంగా రాక్షసుడిలా బిహేవ్ చేశాడు. లలితకు తను వెంటనే క్షమాపణలు చెప్పాలి.

పావుగంట తర్వాత ఆటో గోపాలరావు ఇంటిముందు ఆగింది.

ఆటో చప్పుడువిని బయటకు వచ్చిన పక్కింటావిడ అతన్నిచూసి ఓసారి లోపలకు వెళ్ళి తాళంచెవి, దానితోపాటు ఓ మడత పెట్టిన కాగితం తీసుకొచ్చి ఇచ్చింది గోపాలరావుకి.

గోపాలరావుకు చేతులు వణికాయి.

కాగితం మడత విప్పాడు.

ఏమిటిది ?

'మనిషిని మనిషిగా అర్థం చేసుకోలేని మీతో కాపురం చెయ్యలేను. క్షమించండి — లలిత.'

తూలిపడబోయేడు గోపాలరావు.

# ప్రవేశ పెడుతున్నారు

# క్రొత్త గ్లూకోవిటా లెమన్

## ఒకే ఒక్క ఫ్లేవర్డ్ గ్లూకోజ్

ఇప్పుడు, మీకు ఇష్టమైన గ్లూకోజ్, నిమ్మకాయ రుచితో లభిస్తోంది. ఇది విటమిన్ డి 3 మరియు కాల్షియమ్ ఫాస్ఫేట్‌లతో మరింత బలవర్ధకమవుతోంది. క్రొత్త గ్లూకోవిటా లెమన్, మీ అలసటను అతి త్వరగా పోగొట్టి, మీ సేదను తీరుస్తుంది. ఇంకా ఈ క్రొత్త రుచికరమైన సువాసనను అందరూ ఇష్టపడుతున్నారు నేడే కొని వాడండి. దీనిని ప్రతి ఒక్కరికి ఇవ్వండి!

**ప్రపంచంలో అత్యధికంగా గ్లూకోజ్ తయారుచేసే వారినుండి.**




**ఆహ్లాదకరమైన రుచితో, అతి శీఘ్రంగా శక్తినిస్తుంది.**

OBM-2931 TEL

# సామెతల కథలు

## తెనాలి రామలింగని గుర్రం

బక్కచిక్కి చావటానికి సిద్ధంగా ఉంటే ఎగతాళిగా, అది "తెనాలిరామలింగని గుర్రం" అంటారు. ఇదిదైనందిక జీవితంలో ఎక్కువగా ఉపయోగించకపోయినా, యీ పలుకుబడికి సంబంధించిన కథమట్టుకు అందరకూ తెల్సేవుంటుంది.

రాయలు తన ఆస్థానములోని కొందరకు గుర్రాలను బహుమతిగా ఇచ్చాడు. వాటి పోషణకు, నెల, నెలా డబ్బుకూడా ఇచ్చే వాడు. అలా గుర్రాల్ని బహుమతిగా పొందిన వాళ్ళల్లో, తెనాలిరామలింగడొకడు. రామలింగడు తన గుర్రాన్ని తీసికొచ్చి, చుట్టూరా గోడ కట్టించాడు. ఆ గోడకు, ఆ గుర్రం ముఖానికెదురుగ చిన్న కంత పెట్టించాడు. ఆ లోపల చిన్న గొయ్యి కూడా తీయించాడు. ఆ చిన్న కంతగుండా, రోజుకొకసారి గుప్పెడు గడ్డి పెట్టేవాడు. ఆ చిన్న గోతిలో తాగటానికి నీళ్ళు పోసే వాడు.

తను బహుమతిగా ఇచ్చిన గుర్రాలు ఎలా ఉన్నవో చూడాలనిపించింది రాయలకు. అందర్నీ వారి వారికిచ్చిన గుర్రాలను తీసుకు రమ్మన్నాడు. అందరూ వారివారికిచ్చిన గుర్రాలను తీసుకొచ్చి రాయలకు చూపించారు. అవి అన్నీ బలిసి బాగా ఉన్నాయి. రాయలు చాలా సంతోషపడ్డాడు. రామలింగడు మాత్రం, తనకిచ్చిన గుర్రాన్ని తీసుకురాలేదు. రాయలు ఎందుకు తీసుకు రాలేదని అడిగితే, అది తనకు అలవికావటం లేదని, రాయల పరివారంలోని ఒక సాహెబుని ఆ గుర్రాన్ని తీసుకురావటానికి పంపించవల్సినదని కోరాడు.

రాయలు గడ్డం ఉన్న ఒక సాహెబును, రామలింగడితో పంపించాడు. రామలింగడు




వాణ్ని తీసుకెళ్ళి, తన గుర్రాన్ని ముందుగా, గోడ కంతలోనుండా చూడమన్నాడు. వాడు అలాగే చేసాడు. వాడి గడ్డం పెద్దదవటం వల్ల లోపలకు వెళ్ళింది. అదేమిటో తెలియని గుర్రం, గడ్డి అనుకుని నోటితో [illegible]ట్టుకుంది. వాడు [illegible] న్తుండగా, రామలింగడు వెళ్ళి రాయలను పిల్చుకొచ్చాడు. రాయలు అదిచూసి వాణ్ణి వదిలించటానికి గోడ పడగొట్టించాడు. గుర్రాన్ని చూశాడు. బక్కచిక్కి చావటానికి సిద్ధంగావుంది. నిలబడే శక్తి కూడా దానికి లేనట్టుంది.

రాయలకు కోపంవచ్చింది. దాని ఖర్చుకై యిచ్చిన డబ్బును కూడ రామలింగడు ఖర్చు పెట్టుకున్నాడని తెల్సి మండిపోతాడు. రామలింగడు మాత్రం తొణకకుండా బెణకకుండా "యిలా ఉంటేనే దాన్ని అదుపులో పెట్టలేకపోయాం మీరు చెప్పినట్టు చేసి పెట్టయితే, దాన్ని అదుపులో పెట్టటానికి ఎవ్వరితరమూ అయ్యేదిగాదు" అన్నాడు ప్రశాంతంగా రామలింగడి ధైర్యానికి అందరూ ఆశ్చర్యపడ్డారు. సమయస్ఫూర్తికి, రాయలు పకపకా నవ్వాడు.

వెనుకటిలా యిప్పుడు గుర్రాలు ఎక్కువగా లేవనుకోండి. ఉన్నవి మట్టుకు, వాటి నాధుడెవ్వరైనా, చాలా మట్టుకు తెనాలి రామలింగడి గుర్రాల లాంటివే. గేదలనూ, ఆవులనూ కొనుక్కోటానికి, బలహీన వర్గాల వారికీ, ఇతరులకూ, ప్రభుత్వం ఆర్థికసహాయం చేస్తూంది ఆ ఆర్థిక సహాయాన్నిపొంది గేదల్ని, ఆవుల్ని కొనక పోయినా దూడకు కూడా ఖర్చుపెట్టక, కుషామత్ చేసి, కుషీగా ఉన్న కలియుగ రామలింగలు ఏంతమంది ఉండిఉంటారో...

— పద్మావతీ గంగాధర్

# దిట్రైన్

వెంటు మూర్తిలక్ష్మి

"అరె! మీరొచ్చేసేరే. ఇవాళ కూడా రారేమో అనుకుంటున్నాను నేనింకా" అన్నాడు శర్మ ఉత్సాహంగా – పదిరోజుల తర్వాత మళ్ళీ రోజే సీటులో కనిపించిన 'లత'ని చూస్తూ.

"అబ్బే! ఇదేం నవ్వులేదండీ" అంది లత అదోలా ముఖం పెట్టి.

"ఏది ?"

"అదే! మీరింకా అనుకుంటూ ఉండటం – నే వచ్చేక్కూడా..."

శర్మ గట్టిగా నవ్వేశాడు. లతలో అతనికి బాగా నచ్చే విషయం ఇదే! లత చక్కగా ఉంటుంది. అంతకంటే చక్కగా, చాలాకీగా నవ్వుతూ, నవ్విస్తూ మాటాడుతుంది. ఆమె ఉన్నచోట ప్రతినిముషం నవ్వుల పువ్వులు పూయాల్సిందే!

'మనసారా హాయిగా ఒక్కసారి ఒక్క క్షణం నవ్వుకోని బ్రతుకూ ఒక బ్రతుకేనా' అనిపిస్తుందామెను చూస్తుంటే! దాదాపు ఆమె మాటల్లో వ్యక్తమయ్యే భావం కూడా ఇదే! కొన్ని కొన్ని విషయాల మీద ఆమె చేసే 'కామెంట్' చాలా చిత్రంగా ఉంటుంది.

"పరమ సీరియస్ ముఖాలతో చివరికి మన వేదాంతులంతా తేల్చిందేమిటంటారూ. జీవితాన్ని తామరాకు మీది నీటిబొట్టులా గడపమనేగా! అదెలాగో వివరూ చెప్పలేదు గాని, నన్నడిగితే అంత వేదాంతానికీమూలం 'నవ్వు'లోనే ఉంద్రా – అది చెప్పేద్దును. అవును మరి! హాయిగా నవ్వుకోగలిగినవాడికే కదండీ, జీవితం–తేలిగ్గా, సునాయాసంగా, నీటిబొట్టులా ఉండేది. ఆ శక్తి ఒక్క – 'నవ్వు'లో మాత్రమే ఉంది సుమండీ! ఆ నవ్వేశక్తిని నిలుపుకోలేని వాడికీ, తెలుసుకోలేని వాడికీ బ్రతుకు ఒక బరువులానో, బండరాయిగానో ఉంటుంది కాని నీటిబొట్టులానో, బుడగ్గానో ఎలా ఉంటుందండీ? ఇంతసేపూ ఏమిటేమిటో చెబుతారు గాని, ఇంత చిన్ని విషయాన్ని ఈ వేదాంతులంతా ఇంకెపుడు గుర్తిస్తారండి బాబూ" అంటుంది లత అప్పుడప్పుడూ.

ఇలా అని ఆమె ఎక్కువగా శర్మతోనే అంటుంది. అందుక్కారణమూ లేకపోలేదు మరి! ఈ మాటలిలా శర్మ కొంచెం ఉడుక్కుంటాడు. శర్మకి 'ఫిలాసఫీ' అంటే ఇష్టం. అతనికి మన సనాతన సాంప్రదాయాల పట్నా, ఆచార వ్యవహారాల పట్నా భక్తి గౌరవా లున్నాయి. అవన్నీ అతను పాటిస్తుంటాడు కూడా. ఈ రకమైన విషయాలలో ఇద్దరికీ – ఒకరు తూర్పంటే, మరొకరు పడమర అన్నంత దూరముంది. అయినా అతనికి లతంటే మనస్సులో చిత్రంగా అమితమైన 'ఇష్టత' యేర్పడింది. అంతకంటే చిత్రం ఏమిటంటే లత వివాహిత. ఆమెకు ఇద్దరు పిల్లలు కూడాను. ఈ విషయం అందరిలాగే శర్మకీ తెలుసు. అయినా అతనికి లతపట్ల కలిగే ఆసక్తి, ఆకర్షణా తగ్గటం లేదు. రోజులు గడిచేకొద్దీ – లతతో పరిచయం స్నేహంగా పెరుగుతూన్న కొద్దీ – ఆమె స్వభావం, ప్రవర్తనా, మాట తీరు – అన్నీ ఇంకా ఇంకా అతనిలో ఆమె పట్ల ఆరాధనని పెంచుతున్నాయి. లతను అలా చూస్తున్నకొద్దీ అతనికి – తనక్కావలసిన వ్యక్తి ఈమె అనుకుంటాడు. ఇలా అనుకోవటం వల్ల జరిగేదీ, ఒరిగేదీ ఏమీ లేదని అతని మనస్సు చెపుతూనే ఉంటుంది మరోవైపు. అసలు లత పట్ల తనలో వస్తున్న ఈ రకమైన మార్పుకి తనే విస్తుపోతూ, మనస్సెంత చిత్రమైంది అనుకుంటాడు. కాని అప్రయత్నంగానే అతని మనస్సూ, ఆలోచనలూ నిరంతరం లత చుట్టే తిరుగుతున్నాయన్నది నిజం. ఇందులోంచి తానుగా బయట పడలేక పోతున్నాడతను.

శర్మ తన సీటులో కూర్చుంటూ లత వేపు చూసాడు వారం రోజులుగా పేరుకుపోయిన వర్క్ చేసుకోవటంలో మునిగిపోయిం దామె. శర్మకు లతతో ఇంకా



# డి ట్రైన్

ఏవేవో మాట్లాడాలని ఉన్నా, తప్పదు కనుక తనూ తన పని చూసుకోవడం మొదలెట్టాడు.

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో దాదాపుగా అంతా కాంటిన్‌కి వెళటంతో, చాలా వరకూ ఆఫీసంతా ఖాళీ అయిపోయింది. పని కొంచెం వత్తిడిగా ఉండటంతో, లత కాసేపు విశ్రాంతిగా సీటులోనే ఉండిపోయింది. శర్మ తనే ఇద్దరికోసమూ రెండు కాఫీ ఆర్డర్‌చేసి, లత కొంచెం దగ్గరగా కుర్చీ జరుపు కూర్చుని అప్పు డడిగాడు. "ఇప్పుడు చెప్పండి. ఏవిటి ఒక్కసారిగా చెప్పాచెయ్యకుండా మాయమై పోయారు."

"ఏదండీ. అవతల ముంచుకొచ్చిన కారణాలు మరి చెప్పా చెయ్యకుండా ప్రత్యక్షమయ్యాయయ్యో. లేకుంటే మీకు చెప్పే మాయమవుదామనుకున్నా' కుదిరి చావలా. ఏం చైను చెప్పండి'' అంది లత నవ్వుతూ.

శర్మ కొద్దిగా నవ్వి "అంతే లెండి! మీకంతా నవ్వుగానే ఉంటుంది'' అని, లత ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు. లత చప్పున సంజాయిషీగా "ఛ! అదేం కాదండీ, నిజంగానే ఆ రోజు నే వెళ్లేసరికి పాపకి నాలుగు రోజులుగా ఉన్న జ్వరం యింకా ఎక్కువైంది. అదిగాని అలా విషజ్వరంలోకి దింపుతుందేమోనన్న సూచనగా డాక్టరు అనగానే; ఆ భయంతో ఒక్కసారే పది రోజులు లీవ్ పెట్టేశాను. ఆయమ్మ ఉందనుకోండి. అయినా ఆమె ఒక్కతిమీదా అలావదిలి రాలేక, నేనే దగ్గరుండి జాగ్రత్తగా చూస్తే, ఇదిగో ఇవ్వాళ కాస్త లేచి నవ్వుముఖంతో ఆడుతోంది. హమ్మయ్య! అనుకొని శెలవు ఇంకా రెండ్రోజులున్నా ఇవాళే వచ్చేసా.'' అంది శర్మవేపు చూస్తూ.

శర్మ ఈ మాటలన్నీ విన్నట్టు కనిపించలేదామెకి. ఇంకా అలాగే మౌనంగా, తదేకంగా లత ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడతను. శర్మ చూపుల్లో — ఈ నిముషం పోతే మళ్ళీ రాదేమో అన్నంతగా తపన, దీక్ష వ్యక్తమవుతున్నాయి. శర్మ కళ్లలోకి పరిశీలనగా చూసింది లత. ఎప్పుడూ లేనిది, ఎందుకోగాని ఆ కళ్ళలో అవ్యక్తమయిన బాధ, దిగులు కనిపిస్తున్నాయి. ఎప్పుడూ ఆత్మీయంగా, ఆరాధనగా చూసే ఆ కళ్లలో

ఇటువంటి మార్పుని చూసి లత కలవర పడింది. శర్మ కళ్ళలో ఓ విధమయిన ఆకర్షణ ఉంది. చక్కటి సంస్కారం ప్రతి ఫలించే ఆ అందమైన కళ్ళంటే ఆమెకెంతో ఇష్టం. 'కళ్ళు– మనస్సుని చూపగలిగే వాకిళ్ళు' అని ఎవరన్నారోగాని, శర్మ విషయంలో ఆ మాటెంత నిజం. అతని మనస్సూ, దానిలోని భావాలు అనుక్షణం ఆ విశాలమయిన కళ్ళలో ఎప్పుడూ ఎంత చక్కగా ప్రతిబింబిస్తాయో– అనుకుం టుంది లత. ఆఫీసులో ఆమె అందరితోనూ ఒక్క మాదిరి చనువుతో, స్నేహంగాఉన్నా, శర్మపట్ల ఆమెకి ఓ ప్రత్యేకమైన అభి మానముంది.

"ఏమిటి, అలా ఉన్నారు." మృదువుగా అడిగింది లత

"ఎలా ?"

"ఎప్పుడూ లేనిది ఎందుకోగాని బాధగా దిగులుగా..."

శర్మ ఒకసారి చూపులు తిప్పుకుని, మళ్ళీ లత కళ్ళలోకి చూస్తూ, "మరేమీ అనుకోనంటే నాదో చిన్న రిక్వెస్టు" అన్నాడు నెమ్మదిగా.

లత ఆశ్చర్యంగా చూసింది. ఆ క్షణంలో శర్మముఖం, పసిపాపముఖంలా అమాయకంగా, జాలిగొలిపేలా ఉంది.

"చెప్పండి అసలు మీరెందుకలా అన్నారు. నా దగ్గర మీరేం అడగటానికీ అంత సంకోచం ఎందుకు" అందామె చనువుగా.

"నిజమే! కాని..." అని ఆగి మళ్ళీ తనే "మీరీ ఆఫీసుకు వచ్చి దాదాపు కొద్ది మాసాలై ఉంటుంది. కాని చిత్రంగా మన మధ్య కొన్ని సంవత్సరాల పరిచయమున్నం తగా స్నేహం పెరిగింది. మన స్నేహం ఇంత గాఢమయినది, ఈ రోజు వరకూ నాకే తెలియదు. అసలీ వారం రోజులుగా మీకు దూరంగా, మిమ్మల్ని కనీసం చూడ కుండా ఉంటేకాని తెలిసిరాలేదు. సాధ్య మవునో, కాదో నాకు తెలీదు కాని, మళ్ళీ మళ్ళీ మన మధ్య ఇలాటి పరిస్థితి రాకూడదని – ఇదే నా రిక్వెస్టు. మీరేమయినా అనుకోండి కాని నిజం చెపుతున్నా నీ వేళ – మీరంటే నాకెంతో ఇష్టం. ప్లీజ్ లతా! మీరు నన్ను అపార్థం చేసికోవద్దు, ఇంతకంటే బాగా నా మనస్సంతా అర్థమయ్యేలా మీకెలా చెప్పను." మాట్లాడటం ఆపేసి ఓ విధమైన ఆవేశంతో అప్రయత్నంగా ముందుకొంగి లత చేతులు పట్టుకున్నాడు శర్మ.

లత కంగారుపడి, శర్మచేతుల్లోంచి తన చేతులు మృదువుగా విడిపించుకుని, "అరెరె! ఏమిటిది. మీరెందుకిలా ఫీలవుతున్నారసలు. ఒక ఆఫీసులో ఒకచోట వర్కుచేసే వాళ్ళం. రోజూ మనకి రాక తప్పేదేముంది. మీరు నాకు, నేను మీకూ కనపడక మనమెక్కడి కెళ్తామండీ మీ పిచ్చిగాని." అంది అను నయంగా. అసలామెకిదంతా అయోమయంగా ఉంది. శర్మ మాటలన్నీ ఆమె ఆశ్చర్యంతో వింది.

అతనెందుకలా అవకతవకగా మాటాడు తున్నాడో అర్థం కాలేదు. కాని – ఇంకేదో చెప్పాలన్న బాధ అతనిలో ఉంది. చెప లేక అదిలా ఈ రకంగా – ఏదో చెపుతున్నాడో తనకే తెలియని విధంగా–చెప్పాడని మాత్రం అర్థమయిందామెకి.

ఇంతలో కాఫీ వచ్చింది. ఇద్దరూ మౌనంగా కాఫీ తీసుకున్నారు.

కాసేపటికి–నెమ్మది నెమ్మదిగా, వెళ్ళిన వాళ్ళంతా తిరిగి రావటంతో, చుట్టూ సందడి వచ్చింది.

శర్మ లేచి తన టేబుల్ ముందుకి వెళుతూ "తెలిసో తెలియకో మీ మనస్సు నొప్పిస్తే క్షమించండి" అన్నాడు.

"ఛ ! అవేం మాటలు. మీ మనస్సులో ఏముందో అదే చెప్పారు. అందులో తప్పే ముంది. అయినా నామీద యిష్టత ఉందన్నారు కాని అయిష్టత కాదుగా. అందుకు నిజంగా నే నెంతయినా సంతోషిం చాలి." అంది మనస్ఫూర్తిగా చూస్తూ.

శర్మ ముఖంలో వెలుగు కనిపించింది.

లత ఏదో యాంత్రికంగా పని చూస్తున్నా, ఆలోచనలన్నీ శర్మ మీదే ఉన్నాయి. గంట క్రితం జరిగినదంతా ఓ షాక్‌లా ఉందామెకు. ఒక్కసారిగామనస్సంతా మొద్దుబారి, వెనువెంటనే ఆలోచనలు ప్రవాహంలా వచ్చాయి.

శర్మకి తనపట్ల అభిమాన ముందని తెలుసుగాని. అది ఇంతలా పెంచుకుని పిచ్చిగా ఆరాధిస్తున్నాడా తనని. ఏం చూసి ? ఏముంది తనలో? అయ్యో! అతని హృదయపు లోతుల్లో ఎంత బాధనీ, వ్యథనీ పొందకపోతే, అతనలా బయటపడగలిగాడు. అతని అభిమానానికి కరిగి పోయిందామె. మనస్సులో ఓవైపు అనిర్వచనీయమైన ఆనందం కలుగుతున్నా, మరోవైపు అమిత బాధగానూ ఉంది. ఎందుకిలా జరిగింది ? ముందు ముందు 'ఇది' ఇంకెలా పరిణమించ బోతోంది ?

అతి కొద్ది సేపటిలో అనంతమయిన ఆలోచనలు గిరగిరా తిరిగా యామెలో. ఎంతో సేపటి వరకూ ఎన్నో రకాలుగా శర్మ గురించి ఆలోచిస్తూనే ఉంది ఆమె. బాగా ఆలోచించి, చివరికి ఎలాగో ప్రశాంత పడ గలిగింది.



సాయంత్రం ఆఫీసయ్యాక విడిపోతూ లత శర్మతో అంది.

"రేపు ఆదివారమే కదూ సాయంత్రం వీలయితే మా యింటికి 'టీ'కి రావాలి మీరు. 'వీలయితే' అన్నానని తప్పించుకునే వీలు మాత్రం వెతక్కండి వీలు లేకున్నా చూసుకుని మరీ రావాలన్నమాట. తప్పదు."

"పిలిచి టీ పార్టీ ఇస్తామంటే ఎవరు రారండీ తప్పకుండా వస్తా. ఓపిక లేకపోయినా సాహస మెక్కయినా రావాలంటండీ. అన్నట్టు నాదో చిన్న అనుమానం. ఒట్టి 'టీ' యేనా, లేక దానితో మాంచి స్వీటు, హాటు వగైరా... అవంటే నాకు బోల్డు ఇష్టం మరండీ అబ్బే! నా కోసం అవన్నీ సిద్ధం చెయ్యమని కాదు. అఫ్‌కోర్సు! నే కాదన్నా ఎలానూ మీ ఏర్పాట్లు మీరు చేయక మానరనుకోండి" అన్నాడు శర్మ గమ్మత్తుగా చూస్తూ. అతనిలో ఎప్పటిలా మామూలు ఉత్సాహం కనిపిస్తోంది. ఉషారుగా ఉన్నాడు.

అతని మాటల తీరుకి లత నవ్వేసింది.

"ఏమో అనుకున్నా. మీకూ మాటలొస్తున్నాయే" అంది.

"సాహవాస దోషం" అన్నాడు శర్మ.

ఇద్దరూ నవ్వుకున్నారు.

* * *

ఆ ఆదివారం సాయంత్రం రానే వచ్చింది.

శర్మ లత చెప్పిన గుర్తుల ప్రకారం వాళ్ళింటికి వెళ్ళాడు.

శర్మ వెళ్ళేసరికి లత పిల్లల్తో కలిసి పేక ఆడుతూ, నవ్విస్తూ వాళ్ళని ఆడిస్తోంది.

అతను గుమ్మంలో కాసేపలానే చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో లత మూడనే చూసి, "ఓ! వచ్చేరా. రండి రండి" అంటూ నవ్వు ముఖంతో ఎదురొచ్చింది.

శర్మ లోపలి కొచ్చి లత జరిపిన కుర్చీలో కూర్చున్నాడు పిల్లల వంక చూస్తూ.

పిల్లలిద్దరూ అందంగా, ముద్దుగా ఉన్నారు. 'ఎవరా ఈ కొత్త వ్యక్తి' అన్నట్టున్నాయి వాళ్ళ చూపులు.

లత చిరునవ్వుతో "వీళ్ళిద్దరూ మా పిల్లలేనని మీకీపాటికి తెలిసిపోయే ఉంటుంది. అయినా ముఖ్యంగా ఎపుడూ ఇంట్లో ఉండేది వీళ్ళే కాబట్టి మీకు పరిచయం చేస్తాను మరి" అని, 'వీడు బుజ్జిగాడు, ఇది చిన్న పాప' అంటూ చిన్నగా నవ్వింది.

## ది ట్రైన్

శర్మ వెంటనే "నమస్కారమండీ" అన్నాడు పిల్లలిద్దర్నీ ఉద్దేశించి.

లత పకపక నవ్వింది. "భలేవారండీ మీరు. ఇదేమిటి?" అంది ఇంకా నవ్వుతూనే.

శర్మ తానూ మెల్లిగా నవ్వుతూ "మరి పరిచయం చేసారుగా. నమస్తే చెప్పొద్దూ! పసివాళ్ళు వాళ్ళకెలానూ తెలియదవన్నీ. అన్నీ తెలిసీ, ఇలాటి మర్యాదలన్నీ పెట్టుకుని పాటించే పెద్దాళ్ళమే చెయ్యాలి ఏది చేసినా" అన్నాడు 'కామెంట్' చేస్తున్నట్టు.

లత నవ్వాపుకుంటూ, "ఆయమ్మా!" అంటూ లోపలికి పిలిచింది.

లోపల్నించి ఆయమ్మ రాగానే, "రోజా వెళ్ళే టైమయిందిగా — కాసేపు అలా పార్కుదాకా తీసుకెళ్ళి జాగ్రత్తగా తీసుకురా" అంది.

బుజ్జిగాడు అమ్మ దగ్గరగా వచ్చి, మెల్లిగా "మమ్మీ! నేనివాళ డాడీతోనే వెళతా. ఆయమ్మ వద్దు." అన్నాడు మారాంగా.

"డాడీ రాగానే నే చెప్పి పంపిస్తాగా. నువెళ్ళమ్మా. గుడ్ బాయ్‌వి కదూ" అంది లత.

"సరుంగా చెప్పాలి!"

"ఓ! అలాగే"

ఆయమ్మ పిల్లల్ని తీసుకుని వెళ్ళింది.

శర్మ — లతని ఓ తల్లిగా, కొత్తగా చూస్తున్నాడు.

లత శర్మని చూసి "ఒక్క క్షణం" అంటూ లోపలికెళ్ళింది.

శర్మ ఇంటిని పరిశీలనగా చూస్తూ కూర్చున్నాడు. ఇల్లు చిన్నదే. కాని పొందిగ్గా, నీట్‌గా ఉంది. ఇంతలో లత బయటికొచ్చి, లైట్ టిఫిన్ ఉన్న ప్లేటూ, చిక్కటి 'టీ' ఉన్న కప్పూ-అతని ముందున్న టేబుల్ మీద పెడుతూ, "రాగానే పెడుతున్నారు, తినగానే పొమ్మనా — అనుకునేరు! 'డ్యూటీ ఈజ్ ఫస్ట్' అన్నారు కాబట్టి ముందీపని అయిపోతే, తర్వాత ఎన్నయినా చెప్పుకోవచ్చు కబుర్లు" అంది నవ్వుతూ.

"అరె! నిజంగానే చేసేరేమిటండీ—'టీ' ఒక్కటి చాలుగదా. ఈ మర్యాదలన్నీ ఏమిటండీ" అన్నాడు శర్మ మొహమాటంగా.

## గుడ్డి పువ్వు...?

నా గుండెను
ప్రేమ పుష్పంగా భావించి —
'ఎంత అందమైన పుష్పమైనా...
నూలుపోగు అండలేనిదే దండ
కానేర' దని;
నా పవిత్ర ప్రేమను —
ఆ పుష్పం ముందుంచా
'నేనెంత అందమైన పుష్పాన్నైనా—
నీ నూలుపోగులో దండకాలే'
నంది!
అంతే —
అంతటి నా పవిత్ర భావన —
అనంత వాయువులో కలిసి;
చివరికి నిర్జీవమై పోయింది!!

పి. ఎస్. రామచంద్రరావు



"ఈ మర్యాదలన్నీ ఏమిటండీ - మరీ ఇంత తక్కువగానా చేసేది, అంటారా నిజమేనండీ!" అంది అతని మాటలే తిరిగి మరికొంత కలిపి చెపుతూ శర్మ చప్పున ప్లేటు చేతిలోకి తీసుకుని, లత ముఖంలోకి చూసి నవ్వి. "మీతో మాట్లాడటం కష్టమండీ బాబో. అమ్మమ్మా! ఇంతకీ మీకేది".

"నాకూ ఉంది మీరు కానివ్వండి" అంటూ లోపలికెళ్ళి తనకీ తెచ్చుకుని, అతనితో పాటు ఎదురుగా కూర్చుంది.

కాసేపటికి శర్మ 'టీ' తీసుకుంటూ "ఇవాళ ఆదివారమేకదా మీవార్ని పరిచయం చేస్తారనుకున్నా. వస్తారా ఇప్పుడు" అన్నాడు.

"బావుందండీ మీరు చెప్పేది. ఆదివారమేగా! ఎంతతేలిగ్గా అన్నారు. వారం పాటూ కష్టపడిపోయాక వచ్చేది ఆదివారం. ఇవాళ కూడా ఇల్లూ, ఇల్లాలూ ఏమిటండీ. నాన్సెన్స్. మావారేమన్నా కల్చర్ లెస్ మాన్ అనుకున్నారా" అంది లత తమాషాగా నవ్వేస్తూ.

శర్మ ఆశ్చర్యంగా లత కళ్ళలోకి చూసాడు. నవ్వుతున్న ఆ కళ్ళ వెనుక కనీ కనిపించని నిట్టూర్పు ఉంది.

లత ఆ 'టాపిక్' మారుస్తూ "బయట హాయిగా ఉంటుంది కాసేపలా పైకి వెళ్దాం

రండి" అంటూ లేచింది- తనూ 'టీ'తీసు కోవటం అయ్యాక

ఇద్దరూ మేడెక్కి డాబా పైకి వచ్చారు పరిసరాలన్నీ నిశ్శబ్దంగా కన్పిస్తున్నాయి పౌర్ణమి తప్పు వెలుగు దనం హాయిగా అనిపిస్తోంది. ఆకాశంలో ఒకటీ అరా చుక్కలు ఇంకా అప్పుడే కొద్ది కొద్దిగా తొంగి చూస్తున్నాయి

ఇంటికి కొద్ది దూరంలో ఉన్న రైల్వే లైనుమీద ట్రెయిన్ ఒకటి ఆగ్నేయం దిశగా కనపడుతూంది

లత మౌనంగా అటే చూస్తూ నిలబడింది. శర్మ కూడా లత చూస్తున్న వేపే తనూ దృష్టి నిలిపాడు.

పట్టాలమీదుగా రైలు, చూస్తుండగానే దాటి పోయింది.

"మనిషికో రకం పిచ్చి అన్నట్టు—నాకు రోజూ ఇలా, ఇక్కడే నిలబడి దూరంగా అలా వెళుతోన్న ట్రెయిన్‌ని చూడటం అంటే ఎంత ఇష్టమో!" అంది లత హఠాత్తుగా.

శర్మ చిత్రంగా చూశాడు.

లత నవ్వేస్తూ, "నిజమండీ! ఏరోజైనా మిస్సయ్యానంటే ఇంక ఆ రోజంతా ఏదీ తోచనట్టే ఉంటుంది ఎందుకోగాని" అంది

శర్మకి నవ్వొచ్చింది "మంచి టేస్టే" అన్నాడు ఆమె వంక చూస్తూ.

లత దూరంగా ఖాళీగా కనపడుతూన్న రైలు పట్టాలవంక చూస్తూనే ఉంది ఇంకా.

"ఏమిటండీ లతగారూ! మీరివాళ ఆ అపురూప దృశ్యాన్ని వదిలి రారా ఇంక" అన్నాడు శర్మ నవ్వుతూనే.

"నిజమేనండీ! వింత చూసినా అదే మిటో ఏరోజు కారోజు అపురూపంగా, ఆశ్చర్యంగానే ఉంటుంది నాకు నా ఆశ్చర్యం అంతా దేనికంటే— ఇన్నాళ్ళుగా చూస్తూనే ఉన్నానా, అవి రెండు విడ్డూటినంచో అలా స్నేహంగా ప్రక్క ప్రక్కనే ఉన్నాయి కదా. ఎక్కడో కనీసం ఓ పాయింట్ దగ్గరయినా కలిసిపోయి కనపడవేంటా- అని! ఏ రోజూ వాటిని ఇలాగే సమాంతరంగానే చూడాల్సి వస్తోందికదా!" అంది లత విచారంగా ముఖం పెట్టి.

శర్మ ఫక్కున నవ్వాడు.

లత 'ఎందుకు నవ్వుతారు' అన్నట్టు చూసింది.

శర్మ అతి కష్టంమీద నవ్వాపుకుంటూ "రైలు పట్టాలేమిటి? కలిసి కనబడటం ఏమిటి?" అని మళ్ళీ నవ్వి "అవేమన్నా సినిమా హీరో, హీరోయిన్లా! కాస్త స్నేహం అనగానే ఆనక ప్రేమించేసి, డ్యూయెట్స్ పాడుతూ కలిసి కనిపించటానికి," అన్నాడు ఇంకా నవ్వుతూనే

"అదేం మాట! హీరో హీరోయిన్స్‌కే గాని వీటికి లేదా హక్కు"

"ఏమిటీ! మీరివాళ ఇలా మాట్లాడు తున్నారు" అంటూ నవ్వుతూ లత ముఖంలోకి చూశాడు

లత మాత్రం నవ్వులేకుండా మామూలుగా చూస్తోంది

శర్మకి మాత్రం లోలోపల ఇంకా నవ్వు ఆగటం లేదు.

"పోనీ మీ సిద్ధాంతం ప్రకారం దగ్గరగా కలిసిపోయే అనుకోండి మరి! ట్రెయిన్స్‌ను వాటి మీదుగా సురక్షితంగా తీసుకు వెళ్ళవలసిన బరువు బాధ్యతలు వాటికున్నాయి గదా ఇక రైలు పట్టాలుగా వాటి ఉనికే అనవసరం అన్నమాట. ఇలా అయితే వాటి మీద నడిచే ట్రెయిన్స్‌లాగే, మనవాడి ప్రగతి బోల్తా కొట్టాల్సిందే నండోయ్!"

శర్మ మాటలకి హఠాత్తుగా లత గట్టిగా నవ్వుతూ "హియర్, హియర్" అంటూ చప్పట్లు కొట్టింది

శర్మ అర్థం కానట్టు వింతగా చూశాడు లతని.

'కాసేపటికి లత నవ్వాపుకుని అన్నదంది, "ఇప్పుడు ఏమనిపిస్తోందో చెప్పనా! మీరు కోపం తెచ్చుకోనంటే నాదో చిన్న ప్రశ్న- వాటి స్థానంలో మనమే, అంటే- మీరూ, నేనే ఉన్నామనుకోండి, మన పరిస్థితి అంతే అనుకోవచ్చా?"

శర్మ—నీపుమీద ఎవరో ఛెళ్ళున చరిచినట్టు ఉలికిపడి చూశాడు. ఆమె తనని ఎక్కడికి 'డ్రైవ్' చేసిందో ఇప్పటికి తెలిసి, ఆమె తెలివికి ముగ్ధుడవుతూ ఆశ్చర్యంగా చూశాడు

లత మళ్ళీ తనే అంది "మనకీ కొన్ని బరువు బాధ్యతలున్నాయి వాటిని మరిచి పోయి, మన మధ్య పెరిగిన స్నేహానికి మరో రూపం ఇవ్వటానికి మనం ప్రయత్నిస్తే, 'మనిషి'గా మనకి కీ అనవసరమే నైతికంగా ఉన్నతంగా మన మనుగడ లేనప్పుడు భౌతికంగా ప్రగతి సాధించగా మనం వెనక్కి పోదున్నాం మాట!" అని ఆగి "నా మనసంతా మీ కివాళ చెబుతాను మీరంటే నాకూ ఎంతో ఇష్టం ఒక స్నేహితుడిగా. మన మధ్య ఎలాంటి అభిమానమయినా అది స్నేహ భావంగానే పెరగాలి. తప్పదు. ఎందుకో మీకూ తెలుసు. మన చుట్టూ ఉన్న బాధ్యతలు- నిజానికవి మనం దాటి పోలేని ఓ పరిధి లాంటివి.

నా విషయమే తీసుకుందాం. నేనొక వివాహితని అంతకంటే ముఖ్యం నేను తల్లిని. వివాహ జీవితంలో నాకెన్ని లోపాలున్నా, అసంతృప్తి ఉన్నా కేవలం ఆ



**మీరు 7వ తరగతిగాని 10వ తరగతిగాని చదివే విద్యార్థులయితే**
**యీ ఫోటోలలో మీరూ వున్నారేమో పరిశీలించి చూడండి**



# ఒక తరగతి కోసం ఒక పత్రిక!

## పత్రికాప్రపంచం లోనే ఒక సంచలనం!!

7వ తరగతి, 10వ తరగతి విద్యార్థులకు ఒక అపూర్వ అవకాశం



**మాబడి**
ఏడవ తరగతి విద్యార్థులకోసం



**పాఠశాల**
పదవ తరగతి విద్యార్థులకోసం

జూలై 31లోపల చందాకట్టినవారికి ప్రత్యేక బహుమతులు

- 'మాబడి' కి రూ॥ 10 చందాకట్టిన వారికి రూ॥3 విలువచేసే రెండు పిల్లల నవలలు ఉచితం!
- 'పాఠశాల'కు రూ॥ 18 చందాకట్టిన వారికి రూ॥3-50 విలువచేసే ఎమెస్కో వారి తెలుగు-ఇంగ్లీషు డిక్షనరి + ప్రత్యేక సంచిక (రూ॥4) ఉచితం!

——చందాపైకం పంపాల్సిన చిరునామాలు——

మాబడి
చౌడేపల్లె - 517257
ఆంధ్రప్రదేశ్.

పాఠశాల
చౌడేపల్లె - 517257
ఆంధ్రప్రదేశ్

Marketed By Margadarsi Marketing PRIVATE LIMITED

PRIYTHAM

# వారఫలం

## విద్వాన్ కొట సత్యరంగయ్య శాస్త్రి.

**13–7–1979 శుక్రవారం మొదలు**
**19–7–1979 గురువారం వరకు**

**మేషం :** ఆదాయ విషయంలో లోపంలేదని ఈ వారఫలం, ఫలప్రదాయమని గ్రహించ గలుగు తారు. ధనాదాయంలో లోపం లేదు. క్రొత్తగా చేపట్టిన కార్యాలలో లాభం కూడ వస్తుంది. సూపర మిత్ర సహాయం వలన పెద్దగా లాభించే కార్యక్రమం చేపడుతారు. స్త్రీలకు: సర్వానుకూలమైన వారం. వారఫలం వారారంభంలో అందుకోగలరు.

**వృషభం :** మీ కార్యక్రమాలలో అనుకో కుండా అంతరాయాలొస్తాయి. సాహిత్య కళారంగా లలో, కొందరకు సర్వానుకూలప్రదం. మీ ఆలో చనలు ఫలిస్తాయి. వార మధ్య భాగాన్నుండి ఏమైనా ప్రయత్నాలు చేస్తే లాభదాయకమే. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. ప్రయత్నించి కొన్ని కార్యాలు ఫలప్రదంగా నెరవేరుతాయి

**మిధునం :** సాహసించి అనేక కార్యాల నెరవేర్చు కొంటారు. సాహిత్య కళారంగాల్లో ప్రఖ్యాతి లభి స్తుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి. మిత్రుల వలన కార్యానుకూలత కల్గుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అంత సఫిగా జరగవు. స్త్రీలకు: ఆరోగ్యం బాగుంటుంది. సంతానం వలన సంతోషం ఉంటుంది. బంధుమిత్రులను కలుసు కొంటారు.

**కర్కాటకం :** కార్యక్రమాలు హడావుడిగా ఉం టాయి. ఒక వేళ కార్యక్రమానికి అంతరాయం ఉండవచ్చు. మీ అంచనాలు తారుమారవుతాయి. ఏదో సభా కార్యక్రమంలో చాలమంది పాల్గొనే అవకాశం ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి. మిత్ర సహాయం లభిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. అధికారం చెల్లుతుంది. గౌరవం కద్దు.

**సింహం :** పెద్దలవల్ల, మిత్రుల వల్ల, పరి చితులవల్ల, జరుగవలసిన పనులు నెరవేరుతాయి. ఆదాయం సామాన్యం. ఉద్యోగ విషయాల్లో కూడ పెద్దగా ఫలితం ఆశింపదగిన వారం కాదు. గౌరవా ర్హులతో సంబంధం ఉంటుంది. వారి ఆలోచనలు వింటే మీకు లాభదాయకమే. స్త్రీలకు ఆరోగ్యంలో అంత మేలుగా చెప్ప వీలు లేదు. సామాన్యమైన ధనాదాయం ఉన్నది.

**కన్య :** బాగా శ్రమిస్తారు. విశ్వాసపాత్రంగా పని చేస్తారు. ఆఖరు రెండు రోజులు చాల విధాల మేలుగా ఉంటుంది. ఏదో ఒక రకంగా ధనం సమకూడే అవకాశం ఉంటుంది. దైవకార్యాను కూలత కలదు. స్త్రీలకు: ఆరోగ్య భాగ్యం.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో సర్వానుకూల మైన వారం. కార్యం సాఫల్యమయ్యే వారం. వారఫలం అనుకూలమనీ, ఆదాయం అందిపుచ్చు కున్నట్లు చిక్కిందనీ సంతోషం కల్గుతుంది. వ్యాపార విస్తరణ సుముఖంగా నెరవేరుతుంది. తద్వారా ఆదాయం సంభవం. స్త్రీలకు గౌరవం బాగుం టుంది. లాభం సంభవం. ధనాదాయం కలదు.

**వృశ్చికం :** మనస్సుకు బాధాకరమైన వార్తలను వినటం జరుగుతుంది. వారం మధ్యలో మూడు దినాలు మీకు అనుకూలం అగుట చేత, కొన్ని విధాల మేలు కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనం గల పరిచయాలు, అప్రయత్నంగా లాభం సమకూడుతుంది. స్త్రీలకు: సర్వానుకూలమైన వారం. చలనచిత్ర, వ్యాపార, లలితకళానుభవం గల వారికి నూతనావకాశాలుం టాయి.

**ధనుస్సు :** అపకాశం కోపం గతవారం ఎదురు చూచారు. కాని లాభం లేకపోయిందిగా! ఈ వారం జరుగవలసిన, లాభదాయకమైన పనులు నెరవేరు తాయి. సజ్జన సాంగత్యం, మంచివారి దర్శనం బంధువులతో ఇష్టగోష్ఠి, రావలసిన బాకీలో కొంత భాగం వసూలు కావటం జరుగుతుంది. స్త్రీలకు: ఆరోగ్యం బాగుంటుంది. సంతాన విషయమై ఆనం దం. సౌభాగ్యాభివృద్ధి.

**మకరం :** స్థిరాస్థి వ్యవహారాలు లాభదాయ కంగా ఉంటాయి. చుట్టు ప్రక్కల వారి మధ్య గౌరవం అభివృద్ధి చెందుతుంది. పెద్దల వలన జరుగవలసిన పనులు నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో అభివృద్ధి గ్రహించ గలుగుతారు. స్త్రీలకు: ఆరోగ్యాభివృద్ధి. కన్యలుగా ఉండేకొందరి విషయంలో శుభప్రస్తావన లుంటాయి.

**కుంభం :** వ్యాపారంలో ఆదాయం, ఆరో గ్యంలో మెరుగు, ఆశించడానికి అనుకూలమైన గ్రహానుకూలత గల వారం గాదు. ఏదో వ్యవహారంలో చిక్కుబడి సతమతం కావటం కొందరి విషయంలో నిజం. స్త్రీలకు: ఆదాయమున్నది. వినోద కాల క్షేపాల్లో పాల్గొనటం, సంతానానికి సుఖసంతో షాలు లభ్యం కావటంతో ఆనందాభివృద్ధి కాంక్షించ వచ్చు.

**మీనం :** గృహాన్ని వృద్ధి చేయాలనీ, స్థిరాస్తి సంపాదించాలనీ, వ్యాపారం విస్తరించ చేయాలనీ, భాగస్వామ్య వ్యాపారం చేయాలనీ తలంపు ఉన్నా తగిన ఫలితం అనుభవించే వారం కాదు. ధనాదాయం సంభవం గాదు. స్త్రీలకు: అనేక విషయా లలో ఆనందం సంభవం గాదు. క్రొత్త అవకా శాలు కొన్ని లాభదాయకం కావటంతో, వారఫలం ఫలితానికి వచ్చిందనుకొంటారు. ●




**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# విపుల మానవ మనోదర్పణం







తెలుగు పాఠకులను సువిశాల ప్రపంచంలోని విభిన్న ప్రాంతాల ప్రజల మధ్య ప్రతినెలా విహరింప జేసే ఏకైక మాస పత్రిక 'విపుల'. ఈ విశాల విశ్వంలో గల అనేకానేక భాషలలో వెలువడుతున్న అపూర్వ కథానికా సాహిత్యంలోని ఆణి ముత్యాలను సేకరించి అనువాదం అనిపించనంతటి తేట తెలుగులో సమర్పిస్తోంది 'విపుల'

'విపుల' వంటి విశ్వ కథా విపంచి తెలుగులోనే కాదు, మరే భారతీయ భాషలోనూ కూడా వెలువడటం లేదనేది తెలుగు వారికి గర్వకారణం.

రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో విశిష్ట ప్రమాణాంలో వెలువడే 'విపుల' నెలనెలా అనేక కథలతో పాటు ప్రతి పేజీలోనూ జోకులు, విచిత్ర విశ్వ విజ్ఞానం కూడా అందజేస్తోంది. ప్రతి కథకూ రెండు రంగులలో భావ స్ఫోరక చిత్రాల సమర్పణ 'విపుల' ప్రత్యేకత.

**132** పేజీల విశ్వ కథా విపంచి 'విపుల' కేవలం **125** పైసలకే అందరికీ అందుబాటులో ఉంది.

## విపుల

ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే
విశ్వ కథా వేదిక











Marketed By
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

